రవీంద్ర సాహిత్యము



# బలిదానము

# బలిదానము

★

మూలం:

రవీంద్రనాథ టాగూరు

అనువాదం:

బెల్లంకొండ రామదాసు

★

జయంతి పబ్లికేషన్స్
గోపాలరెడ్డిరోడ్డు : విజయవాడ-2.

3

# బలిదానము

## (ఒకటవరంగం)

ప్రదేశం: త్రిపురలో కాళీమాత ఆలయం

ప్రవేశం: గుణవతి

గుణ: తల్లీ! పరమేశ్వరీ! భయదకాల స్వరూపిణీ! నీ పట్ల నేనేం అపచారం చేశాను తల్లీ? కుక్షికోసం బిడ్డల నమ్ముకునే బిక్షుకస్త్రీల కడుపుకూడా పండించే కరుణామయివే నీవు. తన అపవాదును మాప్పుకోవ డానికి కన్నబిడ్డలనే హత్యచేసే జారిణికి సైతం సంతానభాగ్యం ప్రసాదిస్తావేతల్లి. నేనేం పాపం చేశానని నాపై నీకింత ఆగ్రహం? సకల లోకానికీ రాణినైై సర్వసంపదలూ కలిగికూడా ఈ కడుపున ఒక్క కాయకాయాలనే అడియాసతో నీ కాళ్ళవద్ద పడివున్నానే తల్లీ. ఈ గొడ్రాలి శిక్షను అనుభ వించడానికి నేను చేసిన పాపమేమిటి దేవీ!

(పూజారి రఘుపతి ప్రవేశిస్తాడు, రాణి గుణవతి పూజారికి మొకరిల్లుతుంది.)

గురుదేవా! నేను పూజలో ఏమి ఉపేక్ష చేశానో తమరైనా చెప్పండి. నా భర్త స్వచ్ఛతలో, శీలంలో దైవ సమానుడు కాదా? మరి ఈ ప్రపంచం మహా మాయాజాలాన్ని అల్లిన తల్లికి నాపై యింత ఆగ్ర

హానికి కారణం ఏమిటి? వంధ్యనై ఈ పాడు బ్రతుకు వెళ్ళదీయవలసిందేనా స్వామీ!

రఘు : జగన్మాత చంచల స్వరూపిణి ఆమె మనోభావాలు మనకు దురవగాహాలు. సమస్త ధర్మాలకు తల్లి అతీతురాలు. మన సుఖదుఃఖాలు ఆమె దృష్టికి మభ్యపెట్టి మాయమయ్యే మెరుపుతీగెల వంటివి. అమ్మా, రాణి! కన్న తల్లి నిన్ను కరుణించే వరకు ఓరిమి వహించు. ఈ రోజున పరమేశ్వరి ప్రీత్యర్థం నీ పేరున బలిదానం చేయనున్నాము.

గుణ : స్వామీ! ధన్యురాలను. ముందు నా ప్రణామాలను స్వీకరించండి. పరమేశ్వరి ప్రీత్యర్థం పూవులూ, పండ్లూ, బలిపశువులనూ తెప్పిస్తున్నాను. రక్తాశోకాలూ, బలి పశువులూ రాజప్రాసాదం నుంచి వస్తున్నవి. (ఇద్దరూ నిష్క్రమణ.)

(రాజు గోవింద్, ఆలయ సేవకుడు జైసింగ్,
బిక్షుకబాలిక అపర్ణ ప్రవేశిస్తారు.)

జైసింగ్ : ప్రభూ! తమ ఆజ్ఞ ఏమిటి?

గోవింద్ : జైసింగ్! ఈ అనాథ బాలిక పెంపుడు మేకపిల్లను బలిదానం కోసం ఆలయానికి తీసుకొని వచ్చారా? జగన్మాత ఇలాంటి ప్రసాదాన్ని ప్రసన్నురాలై స్వీకరిస్తుందా?

జైసింగ్ : రాజా! జగన్మాత ప్రీత్యర్థం ప్రతినిత్యం బలిదానం జరుగుతూ ఉంటుంది. భటులు వేలాది బలి పశువులను తెస్తూ ఉంటారు. ఈ బలి పశువులు ఎవరివో,

రాజభటులు పీటిని ఎక్కడి నుంచి ఎలా తెస్తారో మనం ఎలా గుర్తించగలం. (అపర్ణవైపు తిరిగి) అమ్మాయీ! ఎందుకలా కంటతడి పెడతావు? పరమేశ్వరి తనంతతానై ప్రసాదంగా స్వీకరించిన దాని కోసం కంట తడిపెట్టి లాభ మేమిటి?

అపర్ణ : (దేవిముందు మోకరిల్లి) తల్లీ! ఈ లోకానికంతా తల్లివి నీవు. నా మేకపిల్లకు నేను తల్లిని. రాత్రి వేళల ప్రొద్దుపోయి నేను నా గుడిసెకు వెళితే నా మేకపిల్ల నా కోసం కాచుకుని ఉంటుంది. నేను వచ్చే వరకు గడ్డిపోచ కొరకదు. నాకోసం జాల కన్నులతో వీధివైపు చూస్తూ ఉంటుంది. నేను నా కంచంలో అన్నం పెట్టుకొని నాలుగు మెతుకులు నోట్లో వేసుకుంటునే అదికూడా నాలుగు గడ్డిపరకలు కొరుకుతుంది. దానికి తల్లినైనా, తండ్రినైనా నేనే.

జైసింగ్: ప్రభూ! ఈ అనాధ బాలిక ఆక్రందన నాగుండెలు బ్రద్దలు చేస్తున్నది. నా ఆయుష్షునైనా ఇచ్చి ఈ మేక పిల్లను బ్రతికించడం నాకు సంతోషమే. కాని, దేవి తాను స్వయంగా స్వీకరించిన ప్రాణాన్ని మనం ఎలా కాపాడగలం?

అపర్ణ : దేవి ప్రాణాన్ని కోరిందా? అబద్ధం. దేవి కాదు ప్రాణం కోరింది, దెయ్యం.

జైసింగ్ : శివ శివా! (చెవులు మూసుకుంటాడు.)

అపర్ణ : దేవీ! అందరూ నిన్ను జగన్మాతగా పూజిస్తారు. ఒక అనాధబాలిక ప్రేమధనాన్ని అపహరించడమేనా

నీ మాతృత్వం? అయితే నిన్ను శిక్షించేరాజెవరు? ఆ రాజదండం ఎవరి చేతిలోవుంది? (గోవింద్ వైపు తిరిగి) రాజా! నా ప్రశ్నకు జవాబు చెప్పరూ?

గోవింద్ : అమ్మా. అపర్ణా! నీ ప్రశ్నకు సమాధానమిచ్చే శక్తి నాకు లేదు. నన్ను క్షమించు.

అపర్ణ : ఈ మెట్లపైనుంచి జాలువారుచున్న ఈ నెత్తురు నా మేకపిల్లదేనా? చిత్రితల్లీ! ఈ బలిపీఠంపై పూజారులు నీకంఠం ఛేదిస్తున్నప్పుడు, తీయని ప్రాణంకోసం నీవు గిలగిల కొట్టుకొన్నప్పుడు నీవుపిలిచిన పిలుపు ఈ బధిరలోకాన్ని చీల్చుకుని నా హృదయం చేరలేక పోయిందే. [విలపిస్తుంది.]

జైసింగ్: [దేవివిగ్రహంముందు] మాతా, కాళీ! నాబాల్యం నుంచి నిన్ను సేవించాను. నీ సాన్నిధ్యంలో జీవించాను. కాని నీహృదయం నాకు అవగతం కాలేదు. తల్లీ! దయాలక్షణం మర్త్యులైన మానవులకే గాని అమరులైన దేవతలకుండదా? (అపర్ణవైపు తిరిగి) అమ్మాయీ! నాతోరా. నాకు చేతనైన సాయం నేను చేస్తాను. దేవతలు సహాయం చేయలేనప్పుడు, మనుష్యులైనా సాయం చేయాలి.

[జైసింగ్, అపర్ణ వెళతారు. రఘుపతి, రాజుతమ్ముడు నక్షత్రుడు, ఇతర సర్దారులు ప్రవేశిస్తారు.]

అందరు : మహారాజులకు విజయమగుగాక.

గోవింద్ : నేటి నుంచి దేవి ఆలయంలో రక్తబలి నేను శాశ్వతంగా నిషేధిస్తున్నాను.

మంత్రి : దేవికి బలి పూజపై నిషేధమా ?

నయన్ : బలిదానంపై నిషేధమా ?

నక్షత్ర : ఎంత ఘోరం ! బలిదానం నిషేధించడమా !

రఘు : ఇది కలా ? నిజమా ?

గోవింద్ : కల కాదు స్వామీ! కలనుంచి మేల్కొలుపు. ఒక పీడకలకు స్వస్తి. జగన్మాత ఒక అనాథబాలిక రూపంలో నా వద్దకు వచ్చి ఇకపైన తాను రక్తబలి సహించనని చెప్పింది.

రఘు : దేవి యుగ యుగాలనుంచి రక్తపానం చేస్తున్నది. ఈ ఆచారం ఈ నాటిదికాదు.

గోవింద్ : అసత్యం. దేవి ఎన్నడూ రక్తపానం చేయలేదు. రక్తబలి జరిగినప్పుడల్లా ఆ భయానక దృశ్యాన్ని కాంచలేక ఆ కరుణామయి తన ముఖం ప్రక్కకు త్రిప్పుకునేది.

రఘు : జాగ్రత్త మహారాజా !ఆలోచించి అడుగు వెయ్యి. ధర్మశాస్త్రాలు మార్చగల అర్హతా, అధికారం నీకు లేదు.

గోవింద్ : ఈశ్వర వాక్కు అన్ని శాస్త్రాలకూ అతీతమైనది.

రఘు : అనాచారమే కాక అహంకారంకూడానా, రాజా! ఈశ్వర వాణిని విన్నది నీ వొక్కడివేనా ? ఎంత సాహసం!

నక్షత్ర : ఆచార్య దేవులకు వినిపించని బ్రహ్మవాక్కు రాజుకు వినిపించిందట! ఆశ్చర్యం!

గోవింద్ : భగవంతుని వాణి ఎల్లప్పుడూ ఈ ప్రపంచంలో మారుమ్రోగుతునే ఉన్నది. కాని బధిరులకు ఆ వాక్కు వినిపించదు.

రఘు : ఓరి భ్రష్టుడా ! నాస్తికుడా ! ఎంత మాటన్నావు!

గోవింద్ : గురుదేవా ! నామాట మన్నించండి. నా విజ్ఞప్తిని ఆలకించండి. దేవికి ప్రాతః కాలార్చన పూర్తి చేసి, నేటినుండి జగన్మాత సన్నిధిలో ఎవరు రక్తబలి నిచ్చినా వారిని శిక్షిస్తామని భక్తులందరికి ప్రకటించండి.

రఘు : గోవింద్ ! ఇదేనా నీ కడపటి అను శాసనం?

గోవింద్ : చిత్తం.

రఘు : ఓరి పాపహతుడా ! ఎంత మాటన్నావు? చతుర్దశ భువనాలపై ఆదిపత్యంచేసే జగన్మాత కూడా నీ రాజ్య ప్రజలలో ఒక ప్రజ అని భావించావా ? నీ నికృష్ట శాసనాలతో ఆమెను బంధించి ఆమెకు న్యాయ సమ్మతంగా భక్తులు సమర్పించే కానుకలూ, కప్పాలు అపహరిద్దామనుకుంటున్నావా? రాజా ! నాశరీరంలో ప్రాణం ఉండగా ఎన్నటికీ నీ వీ పని చేయలేవు. (నిష్క్రమిస్తాడు.)

నయన్ : రాజా ! క్షమించండి. ఒక చిన్న సందేహం. దేవికి బలిని అరికట్టే హక్కు మనదేనంటారా ?

మంత్రి : రాజా ! తను అనుశాసనాన్ని ఉపసంహరించుకునే అవకాశం లేదంటారా ?

గోవింద్ : మనరాజ్యంలో పాపంఎక్కడ ఏమూల ఉన్నా కూకటి వ్రేళ్ళతో నిర్మూలించాలి. ఇందుకు క్షణ మాత్రంకూడా ఆలశ్యంపనికిరాదు.

మంత్రి : ప్రభూ ! రక్తబలి పాపమంటారా? పాపమయితే ఈ అవనిపై ఇంతకాలం ఈ ఆచారం సాగుతుందా ? మహాదేవిపాదపద్మములవలెనే అనాదినైన ఈ ఆచారాలు పాపాలని ఎలా భావించడం ?

గోవింద్ : (జవాబు చెప్పడు)

నక్షత్ర : మంత్రీ! నీవు చెప్పినమాట ముమ్మాటికీ నిజం.

మంత్రి :. ఈ పూజలూ, ఆచారాలూ ఈనాటివి కావు, మన పితృ పితామహులంతా దేవిని ఇదే విధంగా అర్చించారు. రాజా ! ఈ మహా సాంప్రదాయాన్ని కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించివేసి మన తాతముత్తాతల ఆచారాన్ని విధ్వంసము చేయడానికిసాహసిస్తారా?

నయన్ : యుగయుగాల సాంప్రదాయానికి స్వస్తిచెప్పే అధికారం మీ కెక్కడుంది?

గోవింద్ : ఇక ఈ వాదోపవాదాలు అనవసరం. ఈ సంశయాలను కట్టిపెట్టండి. వెంటనే నా ఆజ్ఞను అష్టరాష్ట్రాలలో ప్రకటించండి.

మంత్రి : ప్రభూ ! నిజమేకానీ... మహారాణి ఈ నాటిప్రాతః కాలంలో దేవి అర్చన చేస్తున్నది. ఆమె పంపిన బలిపూజా ద్రవ్యాలు ఆలయద్వారం చేర్చబడినవి.

గోవింద్ : వాటిని వెంటనే వెళ్ళి పంపి వేయండి.

(నిష్క్రమణ)

మంత్రి : మహారాజా!

నక్షత్ర : అయితే మనమూ బౌద్ధుల స్థాయికి దిగజారి జంతువులకు సైతం జీవించే హక్కున్నదనే సిద్ధాంతాన్ని ఆమోదించవలసిందేనా? ఎంత దారుణం.

(అందరూ నిష్క్రమిస్తారు.)

(రఘుపతి ప్రవేశం. ఆయనకు పాదప్రక్షాళనం చేయడానికి కమండలంతో జైసింగ్ కూడా ప్రవేశిస్తాడు.)

జైసింగ్ : తండ్రీ!

రఘు : వెళ్ళు. నన్ను మాట్లాడించకు.

జైసింగ్ : గురుదేవా! ఇదుగోండి కమండలం.

రఘు : అవసరం లేదు.

జైసింగ్ : కాషాయ వస్త్రాలు.

రఘు : అవతల పారవెయ్యి.

జైసింగ్ : గురుదేవా! నేనేం అపచారం చేశాను. నాపై మీకింత ఆగ్రహ మెందుకు?

రఘు : జైసింగ్! నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళు. నామనస్సు కలవర పెట్టకు. పాపచ్ఛాయలు మరింత ప్రగాఢమైనవి. తమస్సులు క్రమ్ముకుంటున్నవి. రాజసింహాసనం దేవీపీఠంపై విప్లవం లేపుతున్నది. శాసనాలు చేసేందుకు రాజు, మారు మాట్లాడక ఆ నీచశాసనాలను ఔదల ధరించే సరదాళ్లు మీరంతా. ఈ ప్రపంచంలో పరమేశ్వరుని నామ్రమా

జ్యాన్ని ఆక్రమించుకోవడానికి మానవులూ, దానవులూ అంతాకలిసి దండయాత్ర సాగిస్తున్నారన్న మాట. మానవుల దండయాత్రకు భయపడి దేవతలు కూడా నిర్వీర్యులైపోయారు. కాని జైసింగ్! ఒక విషయం మాత్రం మరచిపోకు. దేవతలుసాయం రాకపోయినా బ్రాహ్మణులున్నారు. వారి దారుణ కోపాగ్నికి ఈ రాజు సింహాసనం ఇంధనం కాకపోదు. జైసింగ్! ఎందుచేతనో నా మనస్సు కలవర పడుతున్నది సుమా!

జైసింగ్: ఏమైంది గురుదేవా?

రఘు: నా మనోవేదనను తెలపడానికి మాటలు రావడం లేదు. అనాథురాలైన ఆ అంబికాదేవినే అడుగు.

జైసింగ్: తల్లి అనాథురాలా? ఆవిడను అనాథను చేసే సాహసం ఎవరికుంది?

రఘు: రాజు గోవిందునకు.

జైసింగ్: ఏమన్నారు? మహారాజు కాళిమాతను ధిక్కరించాడా?

రఘు: వెర్రివాడా! ఒక్క కాళీమాతనే ఏమిటి? నిన్నూ, నన్నూ, సమస్త శాస్త్రాలనూ ధిక్కరించాడు. అనంత కాలస్వరూపిణి మహాకాళినే ధిక్కరించాడు. అత్యున్నతమైన ఆ గద్దె అతని నెత్తికి కండ్లు తెచ్చి పెట్టింది.

జైసింగ్: గురుదేవా! మహారాజు గోవిందుడేనా ఈ పని చేసింది?

రఘు : అవును, మహారాజు గోవిందుడే. నీ ఆప్త మిత్రుడు గోవిందుడు. ఎంత ద్రోహం! నిన్ను కడుపున కన్న బిడ్డ కన్న ఎక్కువ ప్రేమతో పెంచి పెద్దచేశాను. కాని ఈ నాటికి నాకంటె గోవిందుడే నీకు ప్రియతముడైనాడు.

జైసింగ్: గురుదేవా! శిశువు తండ్రి ఒడిలో కూర్చుని ఆకాశంలోని చంద్రుని కోసం చేతులు చాస్తాడు. మీరు నాకు తండ్రి వంటి వారు. గోవిందుడు చంద్ర బింబం వంటివాడు. అయితే రాజు బలి, పూజ నిషేధించినట్టు ప్రజలు చెబుతున్న వార్తలు నిజమే నన్న మాట. కాని ఈవిషయంలో మాత్రం రాజాజ్ఞను మనం శిరసావహించడం అసంభవం.

రఘు : అసంభవ మయితే దేశ బహిష్కారం.

జైసింగ్: దేవీ పూజకు నోచుకోని పాపభూమి నుంచి బహిష్కారం అదృష్టమే కాని దురదృష్టం కాదు. గురుదేవా! నేను బ్రతికి ఉన్నంతకాలం దేవీ పూజలో అణుమాత్రం కూడా కొరత రానివ్వను.

— తెర —

మంత్రి : రాజా ! తను అనుశాసనాన్ని ఉపసంహ రించుకునే అవకాశం లేదంటారా ?

గోవింద్ : మనరాజ్యంలో పాపంఎక్కడ ఏమూల ఉన్నా కూకటి వ్రేళ్ళతో నిర్మూలించాలి. ఇందుకు క్షణ మాత్రంకూడా ఆలశ్యంపనికిరాదు.

మంత్రి : ప్రభూ ! రక్తబలి పాపమంటారా? పాపమయితే ఈ అవనిపై ఇంతకాలం ఈ ఆచారం సాగుతుందా ? మహాదేవిపాదపద్మములవలెనే అనాదినైన ఈ ఆచారాలు పాపాలని ఎలా భావించడం ?

గోవింద్ : (జవాబు చెప్పడు)

నక్షత్ర : మంత్రీ! నీవు చెప్పినమాట ముమ్మాటికీ నిజం.

మంత్రి : ఈ పూజలూ, ఆచారాలూ ఈనాటివి కావు. మన పితృ పితామహులంతా దేవిని ఇదే విధంగా అర్చించారు. రాజా ! ఈ మహా సాంప్రదాయాన్ని కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించివేసి మన తాతముత్తాతల ఆచారాన్ని విధ్వంసము చేయడానికిసాహసిస్తారా?

నయన్ : యుగయుగాల సాంప్రదాయానికి స్వస్తిచెప్పే అనికారం మీ కెక్కడుంది?

గోవింద్ : ఇక ఈ వాదోపవాదాలు అనవసరం. ఈ సంశయాలను కట్టిపెట్టండి. వెంటనే నా ఆజ్ఞను అన్ని రాష్ట్రాలలో ప్రకటించండి.

మంత్రి : ప్రభూ ! నిజమేకానీ... మహారాణి ఈ నాటిప్రాతః కాలంలో దేవి అర్చన చేస్తున్నది. ఆమె పంపిన బలిపూజా ద్రవ్యాలు ఆలయద్వారం చేర్చబడినవి.

గోవింద్ : వాటిని వెంటనే వెనక్కు పంపి వేయండి.
(నిష్క్రమణ)

మంత్రి : మహారాజా!

నక్షత్ర : అయితే మనమూ బ్రాహ్మల స్థాయికి దిగజారి జంతువులకు సైతం జీవించే హక్కున్నదనే వెర్రిసిద్ధాంతాన్ని ఆమోదించవలసిందేనా? ఎంత దారుణం.
(అందరూ నిష్క్రమిస్తారు.)
(రఘుపతి ప్రవేశం. ఆయనకు పాదప్రక్షాళనం చేయడానికి కమండలంతో జైసింగ్ కూడా ప్రవేశిస్తాడు.)

జైసింగ్ : తండ్రీ!

రఘు : వెళ్ళు. నన్ను మాట్లాడించకు.

జైసింగ్ : గురుదేవా! ఇదుగోండి కమండలం.

రఘు : అవసరం లేదు.

జైసింగ్ : కాషాయ వస్త్రాలు.

రఘు : అవతల పారవెయ్యి.

జైసింగ్ : గురుదేవా! నేనేం అపచారం చేశాను. నాపై మీకింత ఆగ్రహ మెందుకు?

రఘు : జైసింగ్! నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళు. నామనస్సు కలవర పెట్టకు. పాపచ్ఛాయలు మరింత ప్రగాఢమైనవి. తమస్సులు క్రమ్ముకుంటున్నవి. రాజసింహాసనం దేవీపీఠంపై విప్లవం లేపుతున్నది. శాసనాలు చేసేందుకు రాజు, మారు మాట్లాడక ఆ నీచశాసనాలను తౌదల ధరించే సరదార్లు మీరంతా. ఈ ప్రపంచంలో పరమేశ్వరుని నామమా

జ్యాన్ని ఆక్రమించుకోవడానికి మానవులూ, దానవులూ అంతాకలిసి దండయాత్ర సాగిస్తున్నారన్న మాట. మానవుల దండయాత్రకు భయపడి దేవతలు కూడా నిర్వీర్యులైపోయారు. కాని జైసింగ్! ఒక విషయం మాత్రం మరచిపోకు. దేవతలుసాయం రాకపోయినా బ్రాహ్మణులున్నారు. వారి దారుణ కోపాగ్నికి ఈ రాజు సింహాసనం ఇంధనం కాకపోదు. జైసింగ్! ఎందుచేతనో నా మనస్సు కలవర పడుతున్నది సుమా!

జైసింగ్. ఏమైంది గురుదేవా?

రఘు: నా మనోవేదనను తెలపడానికి మాటలు రావడం లేదు. అనాథురాలైన ఆ అంబికాదేవినే అడుగు.

జైసింగ్: తల్లి అనాథురాలా? ఆవిడను అనాథను చేసే సాహసం ఎవరికుంది?

రఘు: రాజు గోవిందునకు.

జైసింగ్: ఏమన్నారు? మహారాజు కాళిమాతను ధిక్కరించాడా?

రఘు: వెర్రివాడా! ఒక్క కాళీమాతనే ఏమిటి? నిన్నూ, నన్నూ, సమస్త శాస్త్రాలనూ ధిక్కరించాడు. అనంత కాలస్వరూపిణి మహాకాళినే ధిక్కరించాడు. అత్యల్పమైన ఆ గద్దె అతని నెత్తికి కండ్లు తెచ్చిపెట్టింది.

జైసింగ్: గురుదేవా! మహారాజు గోవిందుడేనా ఈ పని చేసింది?

రఘు : అవును, మహారాజు గోవిందుడే. నీ ఆప్త మిత్రుడు గోవిందుడు. ఎంత ద్రోహం! నిన్ను కడుపున కన్న బిడ్డ కన్న ఎక్కువ ప్రేమతో పెంచి పెద్దచేశాను. కాని ఈ నాటికి నాకంటె గోవిందుడే నీకు ప్రియతముడైనాడు.

జైసింగ్: గురుదేవా! శిశువు తండ్రి ఒడిలో కూర్చుని ఆకాశంలోని చంద్రుని కోసం చేతులు చాస్తాడు. మీరు నాకు తండ్రి వంటి వారు. గోవిందుడు చంద్ర బింబం వంటివాడు. అయితే రాజు బలి, పూజ నిషేధించినట్టు ప్రజలు చెబుతున్న వార్తలు నిజమే నన్న మాట. కాని ఈవిషయంలో మాత్రం రాజాజ్ఞను మనం శిరసావహించడం అసంభవం.

రఘు : అసంభవ మయితే దేశ బహిష్కారం.

జైసింగ్: దేవీ పూజకు నోచుకోని పాపభూమి నుంచి బహిష్కారం అదృష్టమే కాని దురదృష్టం కాదు. గురుదేవా! నేను బ్రతికి ఉన్నంతకాలం దేవీ పూజలో అణుమాత్రం కూడా కొరత రానివ్వను.

— తెర —

# రెండవ రంగము

స్థలం : అంతఃపురం

ప్రవేశం : గుణవతి, పరిచారిక

గుణ : ఏమిటి నీవు చెబుతున్నది ? రాణి పంపిన పూజా ద్రవ్యాలను దేవాలయ ద్వారంవద్ద తిరస్కరించారా? ఆ తిరస్కరించిన సాహసికుడికి మెడమీద రెండు తలలున్నవి కాబోలు. ఎవరా అధముడు ?

పరి : అమ్మా! ఆ వ్యక్తి పేరు చెప్పడానికి భయపడుతున్నాను.

గుణ : భయమా? నాకంటే ఈరాజ్యంలో నీవు భయపడవలసిన వారెవరు? అతని పేరు చెప్పు ?

పరి : క్షమించాలి.

గుణ : ఎంతలో ఎంత ఆగడం! నిన్న సాయంత్రమేకదా ఆస్థాన గాయకులూ, కవులూ వచ్చి తమ తమ గాన కావ్య కల్పనతో నన్ను కీర్తించారు. బ్రాహ్మణోత్తములు నన్ను ఆశీర్వదించారు. సేవకులు మౌనంగా నమ్రతతో నా ఆజ్ఞలను స్వీకరించారు. ఇంతలో ఇంత విషమ పరిణామమా ? ఈ త్రిపుర రాజ్యం ఒక స్వప్నలోకంగా మారిందా? (పరిచారికతో) వెంటనే గురుదేవులకు నా నమోవాకాలు చెప్పి వారిని పిలుచుకురా.

పరి : (నిష్క్రమణ.)

(గోవింద్ ప్రవేశం.)

గుణ : ప్రభూ! ఈ ఆగడం విన్నారా? కాళీమాత ఆలయానికి నేను పంపిన బలి ద్రవ్యాలను తిరస్కరించారట.

గోవింద్: అవును. నాకు తెలుసు.

గుణ : మీకు తెలుసా? తెలిసే ఈ పరాభవాన్ని భరించారా?

గోవింద్: రాణీ! ఆ నేరస్థుణ్ణి క్షమించవలసిందిగా నిన్ను అర్థిస్తున్నాను.

గుణ : రాజా! మీ హృదయం కరుణా పూరితమైనదనే విషయం నాకు తెలుసు. కాని కరుణ చూపవలసిన సంఘటన కాదిది. ఇటువంటి దురాగతాలను సహించి క్షమించడం బలహీనత. నేరస్థుణ్ని శిక్షించడానికి మీ కరుణ మీకు అడ్డంవస్తే అతణ్ని శిక్షించే బాధ్యత నాకు వదలండి. ఆ నేరస్థుని పేరు నాకు చెప్పండి చాలు.

గోవింద్: నేరస్థుణ్ని నేనే రాణీ. నీకు బాధ కలిగించడమే నేను చేసిన నేరం

గుణ : మీ మాటలు నాకు అర్థం కావడం లేదు.

గోవింద్: నేటినుంచి నా రాజ్యంలో రక్తబలి నిషేధించబడింది.

గుణ : నిషేధించిన దెవరు ?

గోవింద్: కాళీమాత.

గుణ : కాళీమాత ఆజ్ఞ నివ్వగా ఎవరు విన్నారు ?

గోవింద్: నేను.

గుణ : మీరా? హాస్యమాడు తున్నారు. సర్వ జగధీశ్వరి కాళీమాత వినతి పత్రంతో త్రిపుర రాజ ద్వారంలో నిల్చుందంటారా?

గోవింద్ : వినతి పత్రంతో కాదు కాళీమాత నిల్చున్నది; కన్నీటితో.

గుణ : రాజా ! మీ రాజ్యం కాళీమాత ఆలయ పరిధి లోనిది కాదు. కాళీమాత రాజ్యం వేరు. మీ రాజ్యం వేరు. ఆమె రాజ్యానికి మీ ఆజ్ఞలు పంప కండి. అది అహంకారమే అవుతుంది.

గోవింద్ : ఆజ్ఞ నిచ్చింది నేను కాదు కాళీమాత.

గుణ : రాజా ! మీ నిర్ణయం మీది కావచ్చు. కాని నా విశ్వాసానికి అడ్డు చెప్పకండి. నా పూజ నన్ను చేసుకో నివ్వండి.

గోవింద్ : ఆలయంలో బలిదానాన్ని నిరోధిస్తానని దేవికి మాటిచ్చాను. నా మాట చెల్లించుకుని తీరాలి.

గుణ : మూడు వందల మేకలను, పోతులను దేవికి సమర్పి స్తానని నేను వాగ్దానం చేశాను. నా వాగ్దానం నేను కూడా చెల్లించుకుని తీరాలి.

గోవింద్ : సరే నీ యిష్టం (నిష్క్రమిస్తాడు)

[రఘుపతి ప్రవేశం]

గుణ : గురుదేవా ! కాళీమాతకు నేను పంపిన బలిద్రవ్యా లను త్రిప్పిపంపారు.

రఘు : రాణీ! అధమాగముడైన ఒకబిక్షుకుడు చేసేపూజకూ, ఒక మహారాణిచేసే పూజకూ, దేవి దృష్టిలో తేడా లేదు. ఆమె అన్నిపూజలూ సమదృష్టితో స్వీకరిస్తుంది. కాని ఈనాడు ఆమెకు అన్నిపూజలూ నిరాకరింపబడినవి. మహారాజు అహంకారం పర్వతం వలె పెరిగిపోతున్నది. అతని కోపాగ్ని నేత్రాలు దేవి భక్తులందరినీ దగ్ధం చేయడానికి సిద్ధంగా వున్నవి.

గుణ : గురుదేవా! యీ విషమ పరిణామం మనల్ని ఎక్కడికి తీసుకుపోతుందో?

రఘు : ఆవిషయం ఆ తల్లికి తెలియవలసిందే. కానీ ఒక విషయం మాత్రం స్పష్టం. కాళీమాత పవిత్ర పీఠంపై తన కలుషిత కాళిమాఛాయను ప్రసరింప జేసిన రాచరికం ఒక నీటి బుడగలా బద్దలై శూన్యంలో కలిసిపోక తప్పదు.

గుణ: గురుదేవా! మమ్మల్ని క్షమించి కటాక్షించండి.

రఘు : హా ! హా! నేనా నిన్ను కటాక్షించి కాపాడేది ? త్రిభువనాలకు తాను పాలకుణ్ణని చెప్పుకొని గర్వించే ఒక మహారాజుకు పట్టమహిషివైన నిన్ను కటాక్షించి కాపాడ గలిగింది నేనా! ఏ మహారాజు ముందుకు ఆఖరుకు దేవతలూ, బ్రాహ్మణులూ కూడా...ఛీ...సిగ్గుచేటు. కాలం ఎంత వక్రత వహించింది. ఈ నికృష్టయుగంలో బ్రాహ్మణ శాపం

# రెండవ రంగము

స్థలం : అంతఃపురం

ప్రవేశం : గుణవతి, పరిచారిక

గుణ : ఏమిటి నీవు చెబుతున్నది ? రాణి పంపిన పూజా ద్రవ్యాలను దేవాలయ ద్వారంవద్ద తిరస్కరించారా? ఆ తిరస్కరించిన సాహసికుడికి మెడమీద రెండు తలలున్నవి కాబోలు. ఎవరా అధముడు ?

పరి : అమ్మా ! ఆ వ్యక్తి పేరు చెప్పడానికి భయపడుతున్నాను.

గుణ : భయమా? నాకంటే ఈరాజ్యంలో నీవు భయపడవలసిన వారెవరు? అతని పేరు చెప్పు ?

పరి : క్షమించాలి.

గుణ : ఎంతలో ఎంత ఆగడం! నిన్న సాయంత్రమేకదా ఆస్థాన గాయకులూ, కవులూ వచ్చి తమ తమ గాన కావ్య కల్పనతో నన్ను కీర్తించారు. బ్రాహ్మణోత్తములు నన్ను ఆశీర్వదించారు. సేవకులు మౌనంగా నమ్రతతో నా ఆజ్ఞలను స్వీకరించారు. ఇంతలో ఇంత విషమ పరిణామమా ? ఈ త్రిపుర రాజ్యం ఒక స్వప్నలోకంగా మారిందా? (పరిచారికతో) వెంటనే గురుదేవులకు నా నమోవాకాలు చెప్పి వారిని పిలుచుకురా.

పరి : (నిష్క్రమణ.)

(గోవింద్ ప్రవేశం.)

గుణ : ప్రభూ! ఈ ఆగడం విన్నారా? కాళీమాత ఆలయానికి నేను పంపిన బలి ద్రవ్యాలను తిరస్కరించారట.

గోవింద్: అవును. నాకు తెలుసు.

గుణ : మీకు తెలుసా? తెలిసే ఈ పరాభవాన్ని భరించారా?

గోవింద్: రాణీ! ఆ నేరస్థుణ్ణి క్షమించవలసిందిగా నిన్ను అర్థిస్తున్నాను.

గుణ : రాజా! మీ హృదయం కరుణా పూరితమైనదనే విషయం నాకు తెలుసు. కాని కరుణ చూపవలసిన సంఘటన కాదిది. ఇటువంటి దురాగతాలను సహించి క్షమించడం బలహీనత. నేరస్థుణ్ని శిక్షించడానికి మీ కరుణ మీకు అడ్డంవస్తే అతణ్ని శిక్షించే బాధ్యత నాకు వదలండి. ఆ నేరస్థుని పేరు నాకు చెప్పండి చాలు.

గోవింద్: నేరస్థుణ్ని నేనే రాణీ. నీకు బాధ కలిగించడమే నేను చేసిన నేరం.

గుణ : మీ మాటలు నాకు అర్థం కావడం లేదు.

గోవింద్: నేటినుంచి నా రాజ్యంలో రక్తబలి నిషేధించబడింది.

గుణ : నిషేధించిన దెవరు ?

గోవింద్: కాళీమాత.

గుణ : కాళీమాత ఆజ్ఞ నివ్వగా ఎవరు విన్నారు ?

గోవింద్: నేను.

గుణ : మీరా? హాస్యమాడు తున్నారు. సర్వ జగధీశ్వరి కాళీమాత వినతి పత్రంతో త్రిపుర రాజ ద్వారంలో నిల్చుందంటారా?

గోవింద్ : వినతి పత్రంతో కాదు కాళీమాత నిల్చున్నది; కన్నీటితో.

గుణ : రాజా ! మీ రాజ్యం కాళీమాత ఆలయ పరిధి లోనిది కాదు. కాళీమాత రాజ్యం వేరు. మీ రాజ్యం వేరు. ఆమె రాజ్యానికి మీ ఆజ్ఞలు పంప కండి. అది అహంకారమే అవుతుంది.

గోవింద్ : ఆజ్ఞ నిచ్చింది నేను కాదు కాళీమాత.

గుణ : రాజా ! మీ నిర్ణయం మీది కావచ్చు. కాని నా విశ్వాసానికి అడ్డుచెప్పకండి. నా పూజ నన్ను చేసుకో నివ్వండి.

గోవింద్ : ఆలయంలో బలిదానాన్ని నిరోధిస్తానని దేవికి మాటిచ్చాను. నా మాట చెల్లించుకుని తీరాలి.

గుణ : మూడు వందల మేకలను, పోతులను దేవికి సమర్పి స్తానని నేను వాగ్దానం చేశాను. నా వాగ్దానం నేను కూడా చెల్లించుకుని తీరాలి.

గోవింద్ : సరే నీ యిష్టం. (నిష్క్రమిస్తాడు)

[రఘుపతి ప్రవేశం]

గుణ : గురుదేవా ! కాళీమాతకు నేను పంపిన బలిద్రవ్యా లను త్రిప్పిపంపారు.

రఘు : రాణీ! అధమాధముడైన ఒకబిక్షుకుడు చేసేపూజకూ, ఒక మహారాణిచేసే పూజకూ, దేవి దృష్టిలో తేడా లేదు. ఆమె అన్నిపూజలూ సమదృష్టితో స్వీకరి స్తుంది. కాని ఈనాడు ఆమెకు అన్నిపూజలూ నిరా కరింపబడినవి. మహారాజు అహంకారం పర్వతం వలె పెరిగిపోతున్నది. అతని కోపాగ్ని నేత్రాలు దేవి భక్తులందరినీ దగ్ధం చేయడానికి సిద్ధంగా వున్నవి.

గుణ : గురుదేవా! యీ విషమ పరిణామం మనల్ని ఎక్క డికి తీసుకుపోతుందో?

రఘు : ఆవిషయం ఆ తల్లికి తెలియవలసిందే. కానీ ఒక విషయం మాత్రం స్పష్టం. కాళీమాత పవిత్ర పీఠంపై తన కలుషిత కాళిమాఛాయను ప్రసరింప జేసిన రాచరికం ఒక నీటి బుడగలా బద్దలై శూన్యంలో కలిసిపోక తప్పదు.

గుణ: గురుదేవా! మమ్మల్ని క్షమించి కటాక్షించండి.

రఘు : హ ! హ! నేనా నిన్ను కటాక్షించి కాపాడేది ? త్రిభువనాలకు తాను పాలకుణ్ణని చెప్పుకొని గర్వించే ఒక మహారాజుకు పట్టమహిషివైన నిన్ను కటా క్షించి కాపాడ గలిగింది నేనా! ఏ మహారాజు ముందుకు ఆఖరుకు దేవతలూ, బ్రాహ్మణులూ కూడా...ఛీ...సిగ్గుచేటు. కాలం ఎంత వక్రత వహిం చింది. ఈ నికృష్టయుగంలో బ్రాహ్మణ శాపం

పామై అతడినే తిరిగి కాటు వేస్తున్నది. (యజ్ఞోప వీతాన్ని తెంచుకో బోతాడు.)

గుణ : [వారిస్తూ] గురుదేవా! నన్ను కరుణించండి.

రఘు: రాణీ! నా కటాక్షం నీకు కావలెనంటే నీ రాజు అప హరించిన బ్రాహ్మణుల అధికారాలు తిరిగి వారికి ఇచ్చివేయి.

గుణ : గురుదేవా! తమ అధికారాలు తమ కివ్వడానికి నే నెంతటి దాన్ని. మీరు మీ పూజా కార్యక్రమం ప్రారంభించండి. మిమ్మల్ని ఏ శక్తి నిరోధించలేదు.

రఘు : రాణీ! కృపాహృదయం నన్ను విముగ్ధుణ్ని గావిస్తు న్నది. నీ శీతల సమాన దృష్టి ప్రసరిస్తే చాలు దేవ తలు కూడా పునీతులవుతారు. బ్రాహ్మణులలో అంతరించిన బ్రాహ్మణ్యం తిరిగి పుష్పిస్తుంది. [నిష్క్రమిస్తాడు.]

[గోవింద్ పునః ప్రవేశం.]

గోవింద్ : రాణీ! నీ ముకుళిత భ్రుకుటి నా హృదయదీప్తిని ఆర్పివేస్తున్నది. నా వైపు ఎందుకలా చూస్తావు?

గుణ : వెళ్ళండి. ఈ రాజ కుటుంబాన్ని మీ అత్యాచారా లతో నాశనం చేయకండి.

గోవింద్ : స్త్రీ చిరునవ్వు సర్వ పాపాలనూ పరిహరిస్తుంది. స్త్రీ ప్రేమ ఈశ్వర కటాక్షంవలె శీతలమైంది.

గుణ : ఈ మాటలతో నన్ను విసిగించకండి.

గోవింద్ : రాణీ అలాగే వెడతాను. మళ్ళీ ఏనాడు నీవు నన్ను క్షమిస్తావో ఆనాడే తిరిగి వస్తాను.

గుణ : [రాజు పాదాలుపట్టుకొని] స్వామీ! నన్ను క్షమించండి. స్త్రీ అభిమానాన్ని అర్థం చేసుకోలేనంతగా మీ హృదయం గడ్డ గట్టుకొని పోయిందా? భగ్న ప్రేమ ప్రతీకారంగా మారుతుందన్న విషయం మీకు తెలీదా?

గోవింద్ : ప్రియా! నన్ను అపార్థం చేసుకోకు. నీలో నాకు విశ్వాసం పోతే, నాలో నాకు విశ్వాసం పోయినట్లే. మేఘాలు క్షణమాత్ర మైనవే ప్రియా. కాని సూర్యుడు మాత్రం అన్నివేళలా ప్రకాశిస్తాడు.

గుణ : అవును ప్రభూ! మేఘాలు విచ్చిపోతాయి. ఆవిషయం నాకు తెలుసు పరమేశ్వరుని ప్రళయ గర్జన మళ్ళీ ఆకాశంలో వినిపిస్తుంది. యుగయుగాలుగా ప్రకాశిస్తున్న భానుతేజం సనాతన సాంప్రదాయాలపై తిరిగి ప్రసరిస్తుంది. రాజా! మీరు ఆజ్ఞాపిస్తే చాలు మళ్ళీ బ్రాహ్మణులకు వారి హక్కులు దక్కుతాయి. దేవికి పూజలు ప్రారంభమౌతాయి.

గోవింద్ : చరాచర ప్రపంచానికంతా శ్రేయస్సు కలిగించే శాశ్వత ధర్మాన్ని అతిక్రమించే హక్కు బ్రాహ్మణులకు లేదు రాణీ. రక్తం దేవికి ఆహారం ఎన్నటికి కాజాలదు, రాజుకేకాదు. రైతుకైనా ధర్మం కాపాడే హక్కున్నది.

గుణ : స్వామి! మీ పాద పద్మముల ముందు సాష్టాంగపడి ప్రార్థిస్తున్నాను. యుగయుగాల ధర్మాన్ని మార్చే హక్కు రాజుకులేదు. ఆకాశంలాగ, అవని లాగ,

అనిలం లాగ ఆ ధర్మం మానవులందరికీ చెందినది. కాని ఈ అనాది ఆచారానికి భంగం కలిగించడానికి మీరు ప్రయత్నిస్తున్నారు. ప్రభూ! ప్రజలందరి తరఫున ముకుళిత హస్తాలతో మిమ్మల్ని అర్థిస్తున్నాను. మీరు ఈ అత్యాచారానికి ఒడి గట్టకండి. సంశయాస్పదమైన ఒక విధికోసం ప్రేమ పూరితమైన నా అభ్యర్థనను త్రోసి వేయకండి.

— తెర —

# మూడవ రంగము

## స్థలం : దేవీ ఆలయం

ప్రవేశం : రఘుపతి, జైసింగ్, నయన్‌రాయ్

రఘు : సేనానీ ! జగన్మాత పట్ల నీభక్తి ప్రపత్తులు సర్వ జగద్విదితమైనవి.

నయ : మాతృపూజ మా వంశాచారం గురుదేవా. తర తరాలనుంచి వస్తున్న ఆచారం ఇది.

రఘు : ఈ పవిత్రప్రేమే నీకు అచంచల ధైర్యం కలగ జేస్తుందిగాక. నీ ఖడ్గాంచలానికి, వజ్రాయుధానికి గల శక్తిని ప్రసాదిస్తుందిగాక.

నయ : ద్విజుల ఆశీర్వాదాలు వమ్మైపోవు.

రఘు : నయన్‌రాయ్! అయితే నా ఆదేశం విను. వెంటనే నీ సర్వసేనలూ సన్నద్ధం చేయి. జగన్మాత శత్రువును విధ్వంసం చేయి.

నయ : ఆ శత్రువు యెవరో సెలవివ్వండి.

రఘు : గోవింద్.

నయ : గోవిందుడు ! మహారాజు !

రఘు : అవును. అతనే. నీ శక్తిని యావత్తు కూడగట్టుకుని అతణ్ణి నాశనంచేయి.

నయ : గురుదేవా! ఇది సమంజసమైన సలహాకాదు. మీరు నన్ను పరీక్షిస్తున్నారు.

రఘు : అవును. ఇది నిజంగా పరీక్షే. నీవు నిజంగా ఎవరి సేవకుడవో పరీక్షిస్తున్నాను. సంశయాలను, సందేహాలను ఆవలఉంచు. జగన్మాత ఆదేశం శిరసావహించు. సర్వబంధాలు ఛేదించు.

నయ : గురుదేవా! నా మనస్సు నిశ్చితంగానే వున్నది. పరమేశ్వరి నన్ను నిలిపిన నా స్థానంలో దృఢంగా నిల్చుంటాను.

రఘు : సేనానీ! నీ ధైర్యం అమోఘం.

నయ : గురుదేవా! ఒక విషయం మటుకు నన్ను ఎంతో కలవర పరుస్తున్నది. తల్లిభక్తులందరిలోకి నేను అధముణ్ని కాబోలు. కాకుంటే ఈ రాజద్రోహానికి తల్లి నన్నెందుకు నియమిస్తుంది? మానవ విశ్వాసాన్ని పరీక్షించే పరమేశ్వరే నన్ను విశ్వాస ద్రోహానికి నియమిస్తుందా? ఈ రోజు రాజు, రేపు దేవే నేల పాలు కాదా?

జైసింగ్: ఎంత ఉదాత్తంగా పలికారు సేనాని.

రఘు : రాజు మాతృద్రోహిగా మారాడు. ఆనాడే అతని పట్ల మీ విశ్వాసానికికూడా స్వస్తి చెప్పబడింది.

నయ : గురుదేవా! త్రోవ తెలియని యీసిద్ధాంత రాద్ధాంతాలమహారణ్యంలోకి నన్నులాగకండి. నాకు తెలిసింది ఒకేత్రోవ. నిర్వక్రమైన సత్యపథం. ఆ పథంనుంచి ఈ అధముణ్ని తొలగించకండి. (నిష్క్రమిస్తాడు.)

జైసింగ్: గురుదేవా! మన విశ్వాసమే మనల్ని రక్షిస్తుంది. ఇక భయానికీ, సంశయానికీ తావెక్కడ? ఈ సైనికుల సహాయం మన కెందుకు? పరమేశ్వరి ఆదేశం పాలించే ధైర్యస్థైర్యాలు మనలోనే ఉన్నవి. గురుదేవా! ఆలయ ద్వారాలను బాహాటంగా తెరవండి. విజయ ఢంకాను ప్రమోగించండి. ఓ ప్రజలారా! పౌరులారా! మాతృభక్తులారా! రండి తండోపతండాలుగా రండి. మీకే భయమూ లేదు. దేవిని అర్చించండి.

(పౌరుల ప్రవేశం)

మొదటి పౌరుడు: రండి! రండి! దేవి పిలుస్తోంది.

పౌరులు: జగన్మాతకు విజయమగు గాక.

(అంతా కలసి పాడుతూ నృత్యం చేస్తారు.)

పాట.

జయ జయ మాతా!
నగ్న నర్తకీ!
జయ జయ మాతా!
అగ్ని జ్వాలా జాహార్వా!
జయ జయ మాతా!

జైసింగ్: చూచారా! మహారాణి పంపిన బలి పశువులను సేవకులు తోలుకుని వస్తున్నారు.

పౌరులు: జైమాతా! జై మహారాణీ!

రఘు : జైసింగ్ ! త్వరగా పూజా ద్రవ్యాలన్నీ సిద్ధం చేయి. పూజ ప్రారంభిస్తాను.

జైసింగ్: అంతా సిద్ధంచేశాను గురుదేవా.

రఘు : ఒక సేవకుణ్ణి పంపి నక్షత్ర రాకుమారుణ్ణి పిలవనంపు. (జైసింగ్ నమస్కరిస్తాడు. పౌరులు విజయ గీతాలు పాడుతూ నృత్యం చేస్తారు )

(గోవింద్ ప్రవేశం.)

గోవింద్ : రఘుపతీ ! ఇక నీ ఆర్భాటం చాలించు. నా ఆజ్ఞ ధిక్కరిస్తావా ?

రఘు : అవును.

గోవింద్ : అయితే నీకు దేశ బహిష్కారం తప్పదు.

రఘు : నాకా ? దేశ బహిష్కారమా ? రాజమకుటం నేల పాలైన రాజ్యమే నా రాజ్యం. పౌరులారా ! రాజు మాట చెవిన పెట్టకండి బలి పశువును తీసుకుని రండి.

(పౌరులు తప్పెటలూ, తాళాలు మోగిస్తారు.)

గోవింద్ : ఆపండి. (సేవకులతో) నా సేనానిని పిలవండి. రఘుపతీ ! నా సేనలను పిలిచేటంత వరకు పరిస్థితులు విషమింప జేస్తున్నావు.

రఘు : ఓరి నాస్తికుడా! ఎంత అత్యాచారానికి పాల్పడు తున్నావు. బ్రాహ్మణుని కోపమూ, శాపమూ దుర్ని వార్యాలన్న విషయం గమనించలేకుండా వున్నావు.

పవిత్ర బ్రాహ్మణ కోపాగ్ని జ్వాలలు నా హృదయ హోమాగ్ని గుండాన్ని భేదించుకొని వచ్చి నిన్నూ, నీ సింహాసనాన్ని దగ్ధపటలం చేస్తాయి. నా శాపమే విఫలమయితే నేనీ వేదశాస్త్రాలను, బ్రాహ్మణ్యాన్ని, ఈ ఆచార సంప్రదాయలను గంగలో కలుపుతాను.

(నయన్‌రాయ్, చందపాలులు ప్రవేశిస్తారు.)

గోవింద్ : సేనానీ! నీ సైన్యంతో సహా ఆలయ ప్రాంగణంలో నిల్చుని బలిదానం నిరోధించు.

నయ : క్షమించండి మహారాజా! తమ సేవకుడు ఈ ఆలయ ప్రాకారంలో అశక్తుడు.

గోవింద్ : సేనానీ! నా ఆజ్ఞలు ప్రశ్నించడం నీవంతు కాదు. నా ఆజ్ఞలను శిరసావహించడమే నీ ధర్మం. నా ఆజ్ఞల మంచిచెడ్డలు నాకు సంబంధించినవి.

నయ : రాజా! నేను తమ సేవకుణ్ణే. కాని నేను ఒక మానవుణ్ణికూడా. నాకు మతం, సాంప్రదాయం, ఆచారం వున్నవి. నాపై రాజేకాదు దేవుడుకూడా అధికారి.

గోవింద్ : సేనానీ! అయితే నీ ఖడ్గాన్ని చందపాలుడికి సమర్పించు. ఆతడు ఆలయం రక్త పంకిలం కాకుండా రక్షిస్తాడు.

నయ : ప్రభూ! నా ఖడ్గాన్ని చందపాలుని కెందుకు సమర్పించాలి? ఈ ఖడ్గానికీ నాకూ తర తరాల సంబంధం ఉన్నది. మీ పూర్వులు ఈ ఖడ్గాన్ని నా కిచ్చారు. మీరు కావాలంటే ఈ ఖడ్గాన్ని తిరిగి మీకే సమర్పిస్తాను. వీర స్వర్గాన్ని అలంకరించి ఉన్న ఓ పితృదేవ

తేలారా! మీరు సాక్షులుగా ధైర్య విశ్వాసాలకు చిహ్నమైన ఈ కరవాలాన్ని తిరిగి నారాజుకు సమర్పిస్తున్నాను. (కరవాలాన్ని సమర్పించి నిష్క్రమిస్తాడు)

రఘు : బ్రాహ్మణ శాప ప్రభావం అప్పుడే పని చేయడం ప్రారంభించింది.

(జైసింగ్ ప్రవేశం)

జైసింగ్ : బలి పూజకు పశువులు సిద్ధంగా వున్నవి.

గోవింద్ : బలి పూజ! ఎవరికి ?

జైసింగ్ : రాజా! నా ప్రార్థన ఆలకించండి. నా క్రోధకు అడ్డం రాకండి. (రాజుకు మోకరిల్లుతాడు)

రఘు : సిగ్గుచేటు, జైసింగ్, లే. నీవు మోకరిల్ల వలసిన స్థానం ఇది. (తన పాదాలు చూపుతూ) అది కాదు. (రాజుపాదాలు చూపుతూ) వెర్రివాడా! ఈశ్వర సేవకు రాజు ఆమోదం అవసరమా? పూజా మందిరానికి వెడదాం రా! ఎవరు అవరోధించ గలరో చూస్తాను. [ఇరువురూ నిష్క్రమిస్తారు.]

[అపర్ణ ప్రవేశిస్తుంది.]

అపర్ణ : జైసింగ్! జైసింగ్! [పిలుస్తుంది] ఏడీ జైసింగ్? ఎక్కడికి వెళ్ళాడు? [కాళీమాత విగ్రహంవైపు చూస్తు] తల్లీ! శిలామూర్తివైన నీవు తప్ప ఇక్కడ మరెవరూ లేరా? పెదవి విప్పి ఒక్క పలుకుకూడా

పలకకుండా నీవు మా ప్రియతమపదార్థాలన్నీ అపహ రిస్తావు ? ప్రేమకోసం, ఆదరం కోసం మేము అర్రులు చాస్తాము. కాని మాపై ఒక్క ప్రేమ బిందువైనా వర్షించదు. నీవు కోరకుండానే ప్రేమ నిన్ను ఆశ్ర యిస్తుంది. ఆ ప్రేమంతా నీవు సమాధిలో భూస్థా పితం చేసి ఎవరికి అందకుండా దాస్తావు. జైసింగ్ ! ఇటువంటి మాతృదేవివద్ద నీకుదొరికే సుఖం ఏమిటి ?

[రఘుపతి ప్రవేశం]

రఘు : అమ్మాయీ ! ఎవరు నీవు ?

అపర్ణ : నేనొక బిచ్చగత్తెను. జైసింగ్‌కోసం వచ్చాను.

రఘు : వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపో. జైసింగ్ హృద యాన్ని దేవి హృదయాన్నుంచి దొంగిలించడానికి ఈ ఆలయాన్ని పిశాచిలా వెంటాడుతున్నావు.

అపర్ణ : దేవి నన్నుచూచి భయపడవలసిన అవసరం యేముంది ? నేనే ఆవిడను చూచి భయపడాలి. [వెళుతుంది]

[జైసింగ్, నక్షత్రకుడు ప్రవేశం]

నక్ష : గురుదేవా ! నన్ను పిలువనంపారట.

రఘు : నక్షత్రా ! జగన్మాత గతరాత్రి నాకు స్వప్నంలో కనుపించి ఒక్క వారంరోజులలో నీవు మహారాజువవు తావని చెప్పింది.

నక్ష : నిజంగా !

రఘు : అవును. నీకు రాజయోగం వుంది.

నక్ష : నమ్మలేకుండా ఉన్నాను.

రఘు : నా మాటల్లో నీకు నమ్మకం లేదా ?

నక్ష : నమ్మకూడదని కాదు స్వామీ. ఒకవేళ నమ్మామనుకోండి. తీరా నేను రాజును కాకపోతే.

రఘు : లేదు. నీవు తప్పకుండా రాజువవుతావు.

నక్ష : అదెలా సాధ్యం చెప్పండి.

రఘు : దేవిఇప్పటి రాజు నెత్తురు కోరుతూవుంది.

నక్ష : రాజు నెత్తురా ?

రఘు : అవును.రాజు నెత్తురే. నీవు రాజువు కావాలంటే ఆ నెత్తురును నీవు దేవికి సమర్పించాలి.

నక్ష : ఆ నెత్తురు ఎక్కడ దొరకుతుంది స్వామీ !

రఘు : మూర్ఖుడా ! ఎక్కడ దొరకడం ఏమిటి ? గోవిందుడు లేడూ-రాజు, అతడిని రహస్యంగా చంపు. ఆ నెత్తురు తెల్లారక ముందే బలిపీఠం వద్దకు తెచ్చి దేవికి సమర్పించు.

నక్ష : గోవిందుడు నా సోదరుడే స్వామీ. అతడిని నేను ఎలా చంపగలను ?

రఘు : వెర్రివాడా! నీవు చేయనున్న పూజ అన్నిపూజలలోకి ఉత్తమమైంది.

నక్ష : కాని గురుదేవా ! నేనా పనిచేయలేను నన్ను ఇలా బ్రతక నివ్వండి. చాలు.

రఘు : నీవు తప్పించుకోలేవు నక్షత్రా. ఇది దేవి ఆజ్ఞ. రాజ రక్తంకోసం ఆమె నాలుకను చాస్తోంది. నీవు బ్రతకడమో, నీ అన్న బ్రతకడమో నీవు తేల్చుకోవాలి.

నక్ష : నన్ను కరుణించండి స్వామీ. నా చేత ఈ అత్యాచారం చేయించకండి.

రఘు : దేవి ఆజ్ఞను శిరసావహించేవరకు నీకు శాంతీ, స్వేచ్ఛా వుండవు.

నక్ష : నాకు మార్గం చెప్పండి.

రఘు : వేచి వుండు. సమయం వచ్చినపుడు చెబుతాను, ఇప్పుడు వెళ్లు.

నక్ష : (వెడతాడు.)

జైసింగ్ : గురుదేవా ! ఏమిటీ వైపరీత్యం. కరుణామయి కాళీ మాత ఇలా ఆజ్ఞాపించిందా ? భ్రాతృహత్యను ఆదేశించిందా ?

రఘు : ఇంతకన్న మరి గత్యంతరం లేదు.

జైసింగ్ : గత్యంతరమా ! (దేవిని ఉద్దేశించి) తల్లీ ! నీకు రాజు నెత్తురు కావాలంటే నీవే నీ కరవాలంతో రాజు శిరస్సును నరికివేయ కూడదా ? దొంగతనంగా ఈ అత్యాచారానికి ఒడిగట్టవలసి వచ్చిందా ? ఎంతటి ఘోరపాపం.

రఘు : జైసింగ్ ! నీవు పాపపుణ్యాలను గురించి ఉపన్యసిస్తున్నావేమిటి ? పాపమంటే ఏమిటో నీకు తెలుసా?

జైసింగ్ : మీవద్ద నేర్చిన విషయాలే గురుదేవా!

రఘు : అయితే పాపమంటే ఏమిటో మళ్ళీ జెబుతాను విను. నిజానికి పాపమనే దానికి అర్థమేమీ లేదు. చంపడ మంటే చంపడమే అది పాపముకాదు. పుణ్యమూ కాదు. కోటానుకోట్ల హత్యల ఫలితమే ఈ నాటి ఈ నాగరికత. కాలదేవత మానవచరిత్రను రక్తాక్షరాల తోనే రచించింది జైసింగ్. హింస జంతు సహజం. విశ్వంలో సర్వత్రా హింస ఉన్నది. అడవుల్లో. నగ రాలలో, పల్లెలలో, పిచ్చుకల గూళ్ళలో, చీమల పుట్టలలో సర్వత్రా హింసవ్యాపించి ఉన్నది. లోక ములో ఈ హింసాచక్రం అనాదినుంచి అవిచ్ఛిన్నంగా తిరుగుతూ ఉన్నది, ప్రాణరక్షణార్థం మానవుడుహింస చేశాడు. వినోదార్థం మానవుడు హింస చేశాడు. అనుక్షణం పరిణామ రూపమైన కాలప్రవాహానికి ప్రతి నిధి అయిన కాళీమాత దాహతప్త జిహ్వాంచలం లోకి, ఆ దేవి హస్తంలోని రక్తపాత్రికలోకి, ఈ లోకంలోని అరుణారుణ జీవనరక్తం యావత్స్రావా సవవాహినివలె అన్ని వేళలో, అన్నియుగాలలో ప్రవ హిస్తూనే వచ్చింది.

జైసింగ్ : ఇక చెప్పకండి గురుదేవ్! అయితే ఈ ప్రేమ, ఈ కరుణ, ఈ ఆదరం, అనురాగం, ఈ మహత్తర మానవాదర్శాలన్నీ మాయాకల్పితాలేనా! వినాశ దాహం ఒక్కటే సత్యమా! గురుదేవ్! మీరు నా హృదయాన్ని పరీక్షిస్తున్నారు. నా హృదయంతో చెలలాట మాడుతున్నారు. చూడండి. ఆ దేవి వైపు

చూడండి. ఆమె పరిహాస సూచకంగా చిరునవ్వు నవ్వుతూ నా వైపుచూస్తున్నది. తల్లీ ! రక్తపాన ప్రియా ! నా రుధిరాన్ని నీకు సమర్పించనా ? ఈ కరవాలాంచలంతో నా హృదయాన్ని భేదించి ఈ క్షుద్రజీవితానికి శాశ్వతసమాప్తి చెప్పనా ? తల్లీ ! ఈ నరాలలో ప్రవహించే ఈ నెత్తురుకు అంతటి తీయదనం ఉన్నదా ? తల్లీ ! తల్లీ ! (మళ్ళీ గుడి పతివైపు చూచి) గురుదేవ్ ! నన్ను పిలిచారా ? నా హృదయాన్ని క్షోభింప చేయడానికి సహస్ర విధాలుగా విచ్ఛిన్నం చేయడానికి మీరలా మాట్లాడారు. కాని జగన్మాత ప్రేమమూర్తి గురుదేవా. ఆమె రాజరుధిరము కోరదు.

రఘు: అయితే బలిపూజను ఆపుచేయి.

జైసింగ్ : అవును స్వామీ! బలిపూజ ఆపుచేయవలసిందే... లేదుస్వామీ... నన్ను క్షమించండి. పాపపుణ్యాల నిర్దేశించ వలసింది మీరు. నేను కాను. మానవ హృదయ ధర్మాలకూ, శాస్త్ర ధర్మాలకూ భేదం ఉన్నది. మానవచక్షువులు తమకాంతితో తాము చూడలేవు. కాంతిని అరువు తెచ్చుకుంటాయి. నా అజ్ఞానాన్ని క్షమించండి గురుదేవ్. జగన్మాత నిజంగా రాజ రుధిరాన్ని కోరుతూఉందా ? నిజం చెప్పండి.

రఘు : వెర్రివాడా ! నాలో నీకు విశ్వాసం లేదా ?

జైసింగ్ : గురుదేవ్ ! తమలోనా — నాకు విశ్వాసం నశించడమా ! నా సర్వస్వం తమరే. దేవి రాజరుధి

రాన్నే కోరితే ఆ రుధిరం తెచ్చి దేవికి అభిషేకిస్తాను.
కాని భ్రాతృహత్యను మాత్రం నేను అంగీకరించను.

రఘు : పరమేశ్వరి ఆదేశాన్ని నిర్వర్తించడం పాపంకాదు.

జైసింగ్ : నిజమే. ఆపుణ్యం నాకే దక్కనివ్వండి.

రఘు : కుర్రవాడా ! నీ బాల్యంనుంచి నిన్ను నేను చేతులారా పెంచాను. ఇప్పుడు నీవు నా చేతులు జారిపోతే నేను సహించగలనా ?

జైసింగ్ : నక్షత్రుణ్ని తన వాగ్దానంనుంచి విముక్తి చెయ్యండి గురుదేవ్.

రఘు : కానీ ఆలోచించి రేపు నిర్ణయిస్తాను. (వెళతాడు.)

జైసింగ్ : ఎంత భయంకరమైన దైనా కావచ్చు. ఆలోచన కన్న ఆచరణ గొప్పది. ఆచరణ మందగించినప్పుడే ఆలోచనలు, సందేహాలు, సంశయాలు. గురుదేవ్, మీరు చెప్పింది అక్షరాలా నిజం. సత్యం పలికారు మీరు. హత్య పాపంకాదు. భ్రాతృహత్య పాపం కాదు. రాజహత్యకూడా పాపంకాదు. పౌరులారా ! ఎక్కడికి వెడుతున్నారు ? నిషిపురంలో ఉత్సవానికా? నృత్యగాన వినోదాల ఆనందించడానికి వెడుతున్నారు. ఓహో ! నేనూ వస్తాను మీతో.

(రఘుపతి ప్రవేశం.)

రఘు : జైసింగ్!

జై సింగ్ : మీరెవరో నాకు తెలియదు. నన్ను ఈ జన ప్రవాహంతో కొట్టుకుని పోనివ్వండి. నన్ను ఆపు చేయకండి.

రఘు : జై సింగ్.

జై సింగ్: గురుదేవ్ ! నన్ను ఆపుచేయకండి. నా పథం నా ముందు స్పష్టంగా కన్పిస్తోంది. చేతిలో భిక్షాపాత్రతో, బిచ్చగత్తె ప్రేయసిగా దిగంతాలవరకూ నడచి పోతాను. అడవులు దాటి, కోటలు దాటి, నదులూ, కొండలూ, వాగులూదాటి, నగరాలు దాటి మేము ఈ ప్రపంచాంచలానికి చేరుకుంటాము. అక్కడ ఈ ధర్మాలూ, శాసనాలూ, జీవనసంకుల కల్లోలాలూ వుండవు. అక్కడ చిర ప్రశాంతి, విశ్రాంతి, ఈ శాస్త్రాలూ, ఈ ఉపదేశాలూ, ఈ గురువులూ, బోధలూ...వీటికి అర్థం ఏమిటి? గురుదేవ్ ! ఏమిటి మాట్లాడుతున్నారు? ఏమో ! ఇది కలా? నిజమా? ఇది కల. అదుగోండి! అది ఒక్కటే నిజం. అక్కడ అచంచలంగా నిల్చున్న కాళీమాత భయంకరమూర్తి. గురుదేవ్ ! ఆజ్ఞ నివ్వండి. ఏమన్నారు మీ ఆజ్ఞ? అవును. ఆ... ఆ... ఆ ఆజ్ఞను నేను మరిచానను కుంటున్నారా? మరవలేదు. మీ ఆదేశాన్ని కత్తి నూరినట్లుగా నా మనోఫలకంపై పదును పెతుతూ ఉన్నాను. గురుదేవ్ ! అదొక్కటేనా మీ ఆజ్ఞ? ఇంకా మీ ఆజ్ఞ లేవైనా వున్నవా ?

రఘు : బాబూ! నిన్ను నేనెంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలుసా ?

జైసింగ్: గురుదేవ్! ప్రేమనుగురించి నాతో చెప్పకండి. ధర్మమే నాకు ముఖ్యం. ప్రేమ పచ్చని పచ్చికలాగ వృక్షాలవలె, జీవన సంగీతంవలె, లోకం ఉపరి భాగానికి మాత్రమే సంబంధించింది. స్వప్నంలావచ్చి స్వప్నంలా అదృశ్యమైపోతుంది ప్రేమ. కాని ఈ భువన భవన గర్భంలో పునాదిరాయిలా అచంచలంగా వుండేది ధర్మం.

( ఇద్దరూ నిష్క్రమిస్తారు. )

(గోవిందుడూ, చంద్రపాలుడూ ప్రవేశిస్తారు.)

చంద : రాజా! మీరు జాగరూకులై వుండడం అవసరం.

గోవింద్: అంటే ?

చంద : మిమ్మల్ని హత్యచేయడానికి కుట్ర జరుగుతున్నట్టు ఒక వదంతి విన్నాను.

గోవింద్: నా ప్రాణంతో ఎవరికి అవసరం వచ్చింది ?

చంద : రాజా! ఆ వ్యక్తి పేరు చెప్పడానికి నేను సంకోచిస్తున్నాను. నక్షత్ర రాకుమారుడు.

గోవింద్: నక్షత్రుడా ?

చంద : అవును. మీ రుధిరం దేవికి సమర్పిస్తానని అతడు రఘుపతికి వాగ్దానం చేశాడు.

గోవింద్: దేవికి నా రుధిరం సమర్పిస్తే అది మంచిదే చంద్‌పాల్. అంతకన్న మానవుడు కాంక్షించవలసింది ఏమున్నది? నీ విక వెళ్లు.

చంద: (వెళతాడు.)

గోవింద్: (కాళీమాత విగ్రహాన్ని ఉద్దేశించి) దేవీ! ఈపుష్పాలు స్వీకరించు. నీ భక్తులకు శాంతి ప్రసాదించు. తల్లీ! యీ లోకంలో బలహీనులు మరింత నిస్సహాయులుగా ఉన్నారు. బలవంతులు మరింత క్రౌర్యం చూపుతున్నారు. ఆశకు అంతులేదు. హృదయం లేదు. అజ్ఞానం గ్రుడ్డిది. దురహంకారం నిర్దయగా అల్ప జీవులను తన కాళ్ళక్రింద నలిపివేస్తూ ఉంది. మాతా! నీవు ప్రళయదారుణ ఖడ్గాన్ని ఝుళిపించి రుధిర దాహంతో పెదవులు అప్పళించకు. అన్నదమ్ములమధ్య భార్యా భర్తలమధ్య చిచ్చు రగల్చకు. నాకు అత్యంత ప్రియతముడైన నా సోదరునిచేత నన్ను చంపించడమే నీ అభీష్టమయితే, నీ అభీష్టమే నెరవేరనీ తల్లి. పాపం పండితేనే కాని రాలి నశించిపోదు. ఒకరాజు రుధిరం అతని తమ్ముడే నేలరాలిస్తే అంతటితో ఇన్నాళ్ళూ అమృత మూర్తిగా ప్రజలను మధ్య పెడుతున్న రక్త దాహ పిశాచి ఒక్కమారు తన ముసుగును తొలగించి నిజ స్వరూపం ప్రకటిస్తుంది. ఇదే నీ అభీష్ట మయితే దేవీ! నీ అభీష్టానికి తలవంచుతున్నాను.

(జైసింగ్ ప్రవేశం.)

జై సింగ్: చెప్పుతల్లీ! నీవు నిజంగా, రాజరుధిరం కోరు తున్నావా? నిజంగా నీవు రాజరుధిరం కోరుతూవుంటే నీ స్వీయకంఠస్వరంతో ఆదేశించు తల్లీ. ఆ రుధిరాన్ని నీకు సమర్పిస్తాను.

ఒక కంఠస్వరం : అవును. నాకు రాజరుధిరం కావాలి.

జై సింగ్: విన్నారా రాజా! దేవి ఆదేశం. ఇక మీ కడపటి ప్రార్థన చేయండి. తుదిక్షణం ఆసన్నమైంది.

గోవింద్: అలా నీ వెందుకు భావిస్తున్నావు జై సింగ్ ?

జై సింగ్: మీరు దేవి ఆదేశం వినలేదా ?

గోవింద్: అది దేవి కంఠస్వరం కాదు. నాకు సుపరిచితమైన రఘుపతి కంఠస్వరం.

జై సింగ్: రఘు పతి కంఠస్వరమా అది ? కాదు మహారాజా? నన్ను ఒక సంశయమునుంచి మరొక సంశయంలోకి లాగకండి. గురుదేవుని కంఠస్వరమైనా, జగన్మాత కంఠస్వరమైనా ఒకటే. (ఖడ్గందూసి అవతల విసిరి వేస్తాడు) మాతా! నీ బిడ్డల ఆక్రందనలు ఆలకించు తల్లీ. ఇక పూజతోనే నీ అర్చన. రక్తబలికి స్వస్తి. ఈ రక్తాశోకాలు చూడు తల్లీ. ఈ పుష్పాలుకూడా రక్తరంజితంగా ఉన్నవి. తన బిడ్డల రక్తబలిని కాంచ లేక బాధాతప్తమైన పృథ్వీమాత హృదయం గర్భం చీల్చుకుని ప్రసవించిన పూజాపుష్పాలు తల్లీ ఇవి. ఈ పుష్పాలు స్వీకరించు. తల్లీ! ఈ పుష్పాలు స్వీకరించి తీరాలి నీవు. రక్తదాహంతో ఇక నీవు

నాలుక చాస్తే నేను సహించను. నీ ఆగ్రహానికి భయపడను. నీ ఆగ్రహాన్ని ధిక్కరిస్తాను. ఇకనుంచి నీకు రక్తతర్పణం సాగదు. నీ నేత్రాలు క్రోధారుణాగ్నులు వర్షించవచ్చుగాక. నీవు నీ ఖడ్గం ఝుళిపించి సర్వ ప్రపంచాన్ని విధ్వసం చేయవచ్చుగాక, కాని నేను నీకు తలవంచను తల్లీ. రాజా ! ఇక నీవు వెళ్లు. (గోవిందుడు వెడతాడు.) అయ్యో! ఒక్కక్షణంలో నా విద్యుక్తధర్మాన్ని మరచిపోయానే. నా జగన్మాతనూ, నా గురుదేవుణ్ణి పోగొట్టుకున్నానే.

[రఘుపతి ప్రవేశం]

రఘు : అంతావిన్నాను. ద్రోహీ! ఎంతపని చేశావు? గురుద్రోహం చేశావు.

జైసింగ్ : నన్ను శిక్షించండి గురుదేవ్.

రఘు : నీకేశిక్ష విధించమంటావు జైసింగ్ ?

జైసింగ్ : నా ప్రాణాలు గైకొనండి.

రఘు : అదిఒక శిక్షకాదు జైసింగ్. దేవి పాదాలు స్పృశించి ప్రమాణం చేయి.

జైసింగ్ : చెప్పండిగురుదేవ్. (దేవిపాదాలు స్పృశిస్తాడు.)

రఘు : అర్ధరాత్రిలోగా రాజును చంపి అతనిరక్తం తెచ్చి దేవి పీఠంపై సమర్పిస్తానని వాగ్దానం చేయి.

జైసింగ్ : అర్ధరాత్రిలోగా రాజును చంపి రాజు రుధిరం తెచ్చి ఆరుధిర స్రవంతిని దేవికి సమర్పిస్తాను. (తెర)

# నాలుగవ రంగం

ప్రదేశం : అంతఃపురం

ప్రవేశం : రాణి గుణవతి

గుణ : ఇక లాభంలేదు. నా యత్నాలన్నీ విఫలమైనాయి. ఒకనాటికి కాకపోతే ఒకనాటికైనా ఆయన తనమనస్సు మార్చుకోలేడా అని ఆశించాను. ఆడదాన్ని...... మోసపోయినాను. చివరకు ఏం చేయగలిగాను ? కోపించి ఊరుకున్నాను. స్త్రీకోపం వజ్రం మెరుపు వంటిది. తళుక్కున మెరుస్తుంది. కాని తాకితే కాలదు. ఒక పిడుగువంటి శక్తితో నాకోపం రాజ వంశాన్ని దగ్ధీభూతం చేస్తే ఎంత బాగుండును.

[ధృవుడు (ఒకబాలుడు) ప్రవేశిస్తాడు]

గుణ : ఎక్కడికీ ?

ధృవ : రాజుగారు పిలిచారు. (వెడతాడు)

గుణ : రాజుగారి గారాబు పెంపుడుబిడ్డ వెడుతున్నాడు పుట్టని నా శిశువులపై రాజులోని తండ్రిప్రేమను దొంగిలించినవాడు. కాళిమాతా ! నీ సృష్టి అనంతం అద్భుతం. తల్లీ ! ఒక్క పసికాయను నా కడుపున కాయించు. నీవు ఏది కోరితే దాన్ని ఇస్తాను,

(నక్షత్రుడు ప్రవేశం)

గుణ : నక్షత్రా ! ఏమిటలా వెనకడుగు వేశావు ? నేను స్త్రీని. నిరాయుధను. నేను నీకంత భయంకరంగా కనిపిస్తున్నానా ?

నక్ష నన్ను మాట్లాడించకు.

గుణ : ఏం ?

నక్ష: నాకు రాజు కావాలని లేదు.

గుణ : కావచ్చు. కాని నీకింత ఉద్రేకం ఎందుకు ?

నక్ష: రాజు చిరంజీవిగా ఉండుగాక, నేనే ఇలా రాకుమారుడుగా మరణిస్తాను.

గుణ : మరణిస్తే త్వరగా మరణించు. నిన్ను ఎవరు వద్దన్నారు?

నక్ష : అలాకోప్పడకు. నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు.

గుణ: ఒక దొంగ నీ కిరీటం దొంగిలించడానికి కాచుకొని ఉన్నాడు. వాణ్ణి తొలగించు. నేను చెబుతున్నది నీకు అర్థమవుతున్నదా ?

నక్ష : ఆ, అన్నీ అర్థమయ్యాయి. ఒక్క దొంగమాత్రం ఎవరో అర్థం కావడంలేదు.

గుణ : ఆకుర్రవాడు ధృవుడు. చూడు, ఆ కుర్రవాణ్ని రాజుగారు కన్నకొడుకును పెంచినట్లుగా పెంచు

తున్నారు. వాడు పెరిగి పెరిగి పెద్దవాడై రాజుగారి కిరీటాన్ని నెత్తిన పెట్టుకుంటాడు.

నక్ష : అవును. నేనుకూడా ఈ విషయాన్ని చాలాసార్లు అనుకున్నాను. అప్పుడప్పుడూ మా అన్నయ్య ఆ అబ్బాయిని ఆడిస్తూ కిరీటం వాడి నెత్తిమీద పెట్టడం కూడా చూచాను.

గుణ : కిరీటంతో చెరలాటం నిప్పుతో చెరలాటమే. ఈ చెరలాటాన్ని నీవు ఆపుచేయకపోతే నీతోనే అతడు చెరలాట మాడుతాడు.

నక్ష : అవునవును. నిజం.

గుణ : అతడిని కాళీమాతకు సమర్పించు. కాళీమాత రక్త దాహంతో నాలుకలు చాస్తూ ఉంది.

నక్ష : కానీండి – వదినగారూ! అది నాపని కాదు.

గుణ : మోర్ఖుడా! కాళీమాత అతృప్తురాలుగా ఉన్నంత కాలం నీకు క్షేమముంటున్నదా? ఆమెకు రక్తతర్పణం చేయి. నిన్ను నీవు రక్షించుకో.

నక్ష : కాని, ఆమె కోరుతున్నది రాజ రుధిరం. సామాన్యుని రక్తం కాదు.

గుణ : ఈ విషయం నీ కెలా తెలిసింది ?

నక్ష : దేవి తన రహస్య వాంఛలను అందించే ఒకవ్యక్తి ద్వారా తెలుసుకున్నాను.

గుణ : అయితే ఆ క్షుద్రవాడిని చంపి అతని రక్తాన్ని దేవికి సమర్పించు ఆ అబ్బాయి రక్తాన్ని తన రక్తకంటె కూడా విలువగా చూచుకుంటాడు రాజు.

నక్ష : ఆ, ఆ, నాకు అర్థమైంది.

గుణ: ఆలస్యం చేయకు వెంటనే వెళ్ళు. ఆ క్షుద్రవాడు ఎంతో దూరం వెళ్ళి ఉండడు. కాని ఒక విషయం మాత్రం మరచిపోకు. అతని రక్తం నా పేరిట దేవికి సమర్పించు.

నక్ష : ఓ, అలాగే.

గుణ: నేనుపంపిన బలిద్రవ్యాలను రాజభటులు ఆలయద్వారంలో నిరోధించరు. దేవికి నా క్షమాపణలుచెప్పు.

[ తెర ]

# ఐదవ రంగం

ప్రదేశం : దేవీ ఆలయం.

ప్రవేశం : జైసింగ్

జైసింగ్ ; దేవీ ! నా కలలన్నీ మట్టిపాలు చేశావు. ఇక మిగిలిందేమిటి ? వెలుగంతా అస్తమించిపోయింది. మినుకు మినుకుమనే సంధ్యాతారలలో ఎక్కడైనా రవంత వెలుగు మిగిలిందేమో. దేవీ ! నా మొరకు జవాబు చెప్పవూ ? నాలో విశ్వాసం కలిగించవూ ? "కుమారా ! నేనున్నాను. నేను మిథ్యకాను," అని ఒక్కమాట అను తల్లీ. చాలు. లేదు, లేదు. దేవి లేదు. అంతా అబద్ధం, ఓ మిథ్యామూర్తీ ! ఈ జైసింగును కరుణించు. అతడి కోసమైనా నీవు సత్యరూపం ధరించు. తల్లీ! నీవు ఇంతటిమిథ్యామూర్తివా? నా ప్రేమ, నాభక్తి, నా విశ్వాసం నీమాయామానసశూన్యతలో అణుమాత్రమైనా జీవప్రకంపం కలగజేయడం లేదా ? ఓరి వెర్రివాడా ! ఎవరికోసం ఈ యాతన? ఎవరికోసం నీ జీవనపాత్రికను ఒలకబోసుకున్నావు ? అయ్యో, చివరకు ఒక్క జీవనబిందువుకూడా మిగలకుండా ఒలకబోసుకున్నావే. ఎంత వెర్రి! ఎవరికోసం? సమాధానం చెప్పని ఈ మానసశూన్యమూర్తికోసమా? సత్యరహిత, అర్థ రహిత, కరుణా రహిత, మాతృతా రహితమైన ఈ కఠిన శిలామూర్తికోసమా ? గుండె బండగా మారిన ఈ తల్లి కోసమా ?

(అపర్ణ ప్రవేశం.)

జైసింగు : మళ్ళీ వచ్చావా ? ఎంత వెర్రిదానివి నీవు ? నిన్ను వారు తరిమివేస్తూ ఉంటే మళ్ళీ ఈ ఆలయానికి ఎందుకు వస్తావు తల్లి. అవును. నీవు సత్య స్వరూపిణివి. సత్యాన్ని ఎవరూ తరిమివేయలేరు. సత్యం అజేయం. ఈ గుళ్ళల్లో, గోపురాలలో అర్థ రహితమైన అసత్యాన్ని ప్రతిష్టించి పూజిస్తాము, అపర్ణా ! ఇలారా. నన్ను వదలకు విడిచి వెళ్ళకు. ఇలారా, నా దగ్గర కూచో. (అపర్ణ వచ్చి అతని దగ్గర కూచుంటుంది.) చిట్టి తల్లి ! అలా విచారంగా ఉన్నావేం? దేవత కాని దేవత ఎవరో నిన్ను దయ చూడలేదా ? కాని మనం బతికే ఈ చిన్న ప్రపంచంలో, మనం బతికే ఈ చిన్న బతుకులో దేవుళ్ళతో మనకు అవసరం ఉందా తల్లి ? దేవుళ్ళు లేకుండా మానవులు అనుబంధంతో, అనురాగంతో జీవించ లేరా ? దేవుళ్ళు మనకెందుకు తల్లి ! దేవుళ్ళు రక్తం కోరుతారు. రక్తంపై ఆశతోనే వారు తమస్వర్గాన్ని వీడి పృథ్వీస్థలానికి దిగివచ్చారు. స్వర్గంలో మనుష్యులూ, జంతువులూ ఉండరుకదూ. తల్లి ! అంతా కల్ల. కాళీమాత కల్ల.

అపర్ణ : అయితే యీ ఆలయాన్ని వీడిరా. నాతో రా, వెడదాం.

జైసింగు ; ఈ ఆలయం వీడిరానా ? అలాగే వస్తాను తల్లి. వెడదాం పద. అపర్ణా ! అయ్యో హృదయం ఎంత

రాయిచేసుకున్నా ఈ కాళీ మాతను వీడి రాలే కున్నానే, కానీ, వస్తాను. ఇలారా తల్లి. నా దగ్గరకు రా. నాచెవుల్లో ఏదైనా చల్లటి మాటలు చెప్పు, మృత్యువునుసైతం శీతలంచేసే ఏవైనా చల్లని మాటలు చెప్పు తల్లి.

అపర్ణ : మనస్సు నిండుగా ఉన్నప్పుడు మాటలెలా వస్తాయి జైసింగు.

జైసింగు : అయితే, నీతలను నాగుండెపై అనించు తల్లి. జనన మరణాల అనంతాంచలాలు పరస్పరం స్పృశించనీ...ఇక లాభం లేదు. నానిశ్చయం కని పిస్తోంది... నేను వెళ్ళాలి.

అపర్ణ : జైసింగు! మనస్సు రాయిగా మార్చుకోకు. జైసింగు క్రౌర్యానికి ఒడిగట్టకు.

జైసింగు . నేను క్రూరాత్ముణ్ణా ? అపర్ణా ! ఇదేనా నీవునన్ను అర్థం చేసుకున్నది? ఇదేనా నీవు నాకు చెప్పే కడపటిమాట ? ఈ కఠినశిలాకృతి కాళీమాతలాగ నేను క్రూరాత్ముణ్ణా? అపర్ణా ! నీవు దేవివయితే ఈ నిర్భాగ్యుని హృదయంలో ఎంత భయంకరమైన బాధాగ్ని జ్వలిస్తూ ఉన్నదో అర్థంచేసుకోగలిగే దానివి. కాని నిజంగా నీవు దేవతవే తల్లి. నీవు దేవతవని నేను ఎలా తెల్సుకున్నానో చెప్పనా ?

అపర్ణ : చెప్పు జైసింగు.

జైసింగు : ప్రతిక్షణం నీవు నీ మహాత్యాగాన్ని నాకు జ్ఞాపకం చేస్తుంటావు. తల్లి శిశువును జ్ఞాపకం చేసినట్టు. స్వర

నేర్పగడంటే పరిపూర్ణమైన త్యాగమే తల్లి. తన దంతా సృష్టికి ఇచ్చి వేయడం.

అపర్ణ: జైసింగ్! ఇక ఈ ఆలయాన్ని విడిచి వెడదాం రా జైసింగ్.

జైసింగ్: అపర్ణా! నన్ను కరుణించి విడిచిపెట్టు. నా జీవిత లక్ష్యాన్ని అపహరించకు అపర్ణా. (విసురుగా వెడతాడు.)

అపర్ణ: నా హృదయం బ్రద్దలవుతూంది. (వెళుతుంది.)

( రఘుపతి, నక్షత్రకుడు ప్రవేశం )

రఘు : నక్షత్రా ! ఆ కుర్రవాణ్ణి ఎక్కడ వుంచావు?

నక్ష : పూజా పాత్రలు దాచే గదిలో ఉంచాను గురుదేవ్. ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు. గురుదేవ్! ఆ కుర్రవాడి ఏడ్పు వినలేను గురుదేవ్.

రఘు : జైసింగ్ నావద్దకు వచ్చినప్పుడు సరిగ్గా యీ ఈడు వాడే. వాడుకూడా ఇలాగే ఏడ్చి ఏడ్చి దేవి పాదాల వద్ద అశ్రుసిక్త ముఖంతో, దీపారాధన మసక వెలుగులో నిద్రించాడు ఆ సంఘటన ఈనాడు జ్ఞప్తికి వస్తూంది నక్షత్రా. ఆ రోజుకూడా ఇలాగే పెద్ద తుఫాను వస్తోంది.

నక్ష : గురుదేవ్! ఆలస్యం చేయకండి ఆజ్ఞనివ్వండి. కుర్రవాడు నిద్ర పోతున్నప్పుడే పని ముగించేస్తాను. కిక్కురుమనడు. వాడు లేచి కెవ్వుమన్నాడంటే ఆ కేక నేను వినలేను.

రఘు : వాడు నిద్ర లేస్తే మళ్ళీ మత్తుమందు ఇస్తాను.

నక్ష : గురుదేవ్ ! మనం తొందరపడకపోతే అంతా రాజుకు తెలిసిపోతుంది. ప్రతి సాయంత్రం రాచ కార్యాలు ముగించుకొని రాజుగారు ఈ క్షురవాణ్ణి చూడడానికి వస్తూ వుంటారు.

రఘు : దేవిలో నమ్మకం వుంచు నక్షత్రా. పని సక్రమంగా జరిగిపోతుంది. పిట్ట పంజరంలో చిక్కింది. ఇక ఎక్క-డికి వెడుతుంది ?

నక్ష : చందపాలుడు సామాన్యుడు కాడు గురుదేవ్. వాడికి ఒళ్ళంతా కళ్ళే. ప్రతివిషయం ఒకకంట కనిపెట్టి ఉంటాడు.

రఘు : సర్వలోకాలను కనిపెట్టే జగన్మాతకంటే వాడు చార చక్షువంటావా నక్షత్రా ?

నక్ష : అటు ఏదో నీడ కనుపించింది గురుదేవ్. ఎవరో అటు వెళ్లినట్టుగా వున్నారు.

రఘు : నీ నీడనుచూచి నీవే ఉలికి పడుతున్నావు.

నక్ష : గురుదేవ్! ఆశబ్దం ఏమిటి? ఎవరో కేకవేసినట్టున్నారు?

రఘు : పిరికివాడా ! అది నీ గుండెదడ. అంతకంటె మరేం కాదు, నక్షత్రా ! పిరికితనం త్యజించు. ఇలారా. దేవికి నివేదన చేసిన ఈ మధువు సేవించు. మనస్సులో ఆదర్శం, ఆదర్శంగా వున్నంతకాలం అల్ల కల్లోలంగా భయంకరమైన ఆలోచనలు చెలరేగు తాయి. ఆదర్శం ఆచరణలో పెడితే, కొండంత ఆదర్శం గోరంతదిగా మారుతుంది. ఉషఃకాలంలో మంచు మసకగా అస్పష్టంగా ఉంటుంది, కాని తెల్ల

వారిన తరువాత జలబిందువులుగా మారుతుంది. అప్పుడే అస్పష్టత వుండదు రాకుమారా! ఆందోళనలూ, ఆలోచనలూ ఇలాంటివే, భయపడకు. ఒక్క-క్షణం. ఒక్క-క్షణం చాలు. అంతా అయిపోతుంది. దీపం వత్తిని ఉప్పున ఊదేశినట్టు జీవనదీపశిఖ క్షణంలో ఆరిపోతుంది. పెనుతుఫాను వీచే శ్రావణకాల రాత్రి నాటి మెరుపు తీగెలా మాయమైపోతుంది. కాని ఆభయదమేఘ ఘర్జన మాత్రం ఎప్పుడూ రాజు గుండెల్లో మారుమ్రోగుతూనే వుంటుంది. నక్షత్రా! అలా మాట పలకకుండా చూస్తావేమిటి?

నక్ష : మనం తొందర పడకూడదు గురుదేవ్! ఈ కార్యం రేపు రాత్రికి...

రఘు : రేపైనా, నేడైనా ఒకటే రాకుమారా.

నక్ష : వినండి...ఏదో అడుగుల చప్పుడు.

రఘు : నాకేం వినిపించడం లేదు.

నక్ష : చూడండి, ఏదో దీపం కనుపిస్తున్నది.

రఘు : రాజు వస్తున్నాడు.

(గోవింద్ భటులతో ప్రవేశం)

గోవింద్ : వారిని బంధించండి.(రఘుపతి వైపుచూచి)రఘుపతీ! నీవు చెప్పదలచింది ఏమైనా ఉన్నదా?

రఘు : ఏమీ లేదు.

గోవింద్ : చేసిన నేరము వప్పుకుంటున్నావా?

రఘు : నేరమా? కాళీమాత సేవను ఆలస్యం చేయడమే నేను చేసిన నేరం. అందుకు జగన్మాతే నన్ను శిక్షిస్తున్నది. నీవు సాధనం మాత్రమే.

గోవింద్ : రఘుపతీ! నీకు ప్రవాస శిక్ష విధిస్తున్నాను. నా భటులు నిన్ను ప్రవాసం విడిచి వస్తారు. నీవు ఎనిమిది సంవత్సరములు ప్రవాస జీవితం గడపవలసి ఉంటుంది.

రఘు : రాజా ! నే నెన్నడూ నా జీవితంలో మానవ మాత్రుడి ముందు తల వంచలేదు. జన్మతః నేను బ్రాహ్మణుణ్ని, నీవు నా కన్న అధమ జాతి వాడివి. కాని సశ్రమశిరస్కుడనై నిన్ను ఒక్క విషయం అర్థిస్తున్నాను. ఒక్కరోజు నాకు వ్యవధి నివ్వండి.

గోవిం : అలాగే నీ కోరిక మన్నించాను.

రఘు : (వెక్కిరిస్తున్నట్టుగా) నీవు రాజాధిరాజువు. నీఔదార్యం, శీవి అనుపమానాలు. నేనో ఒక క్రిమిని. నేలపై పడి పొర్లాడుతున్న ఒక క్రిమిని. (నిష్క్రమిస్తాడు)

గోవిం : నక్షత్రా ! చేసిన నేరం ఒప్పుకో.

నక్ష : నేరంచేశాను నిజమే. కాని నిన్ను క్షమాపణ కోరాలంటే నాకు ధైర్యం చాలడం లేదు.

గోవిం : నక్షత్రా ! నీవు అమాయకుడివి. నీకు ఈ దుష్టాలోచన చెప్పిన వారెవరు ?

నక్ష : ఒకరి పేర్లు అనవసరం రాజా. నా తప్పు నాదే. అనేకసార్లు నీ కృత్రితమ్ముణ్ని నీవు క్షమించావు. ఈ సారి కూడ క్షమించు (రాజు పాదాలు పట్టుకుంటాడు.)

గోవిం : నక్షత్రా ! లే. శాసనాలు నేరస్థునికంటె న్యాయమూర్తిని ఎక్కువగా బంధిస్తాయి.

సేవకులు : మహారాజా ! తమ తమ్ముణ్ని బంధుత్వం వల్లనైనా విడిచిపెట్టండి.

గోవిం : నేను నక్షత్రుడికి అన్ననే కాదు, రాజునుకూడా. నా విద్యుక్తధర్మం నేను నిర్వహించాలి. నక్షత్రుడు ఎనిమిది సంవత్సరాలపాటు త్రిపుర సరిహద్దులకు ఆవల పవిత్ర నదీతీరంలో మనం నిర్మించిన భవనంలో ప్రవాసశిక్ష అనుభవిస్తాడుగాక. తమ్ముడూ, నక్షత్రా! ఇది నీకేకాదు, నాకుకూడా శిక్ష. మానసికంగా నీ శిక్షను పంచుకోగలిగినా, శారీరకంగా నీ శిక్షను పంచుకోలేనందుకు చింతిస్తున్నాను. నీవు దూరంగా వెళ్ళిపోతున్నావు. అనుక్షణం నీవులేని శూన్యత నా హృదయాన్ని దహిస్తూనే వుంటుంది.

(అంతా నిష్క్రమిస్తారు.)

(రఘుపతి, జైసింగ్ ప్రవేశం)

రఘు : కాళీమాతా ! చివరకు నన్నింతటి దుర్భర స్థితికి తెచ్చావు. అభిమానం మంట కలిసింది. నా బ్రాహ్మణ్యాన్నే నేను అవమానించాను. జైసింగ్ ! ఇక నీకు నేను గురుదేవుణ్ణి కాను. నిన్న నేను నిన్ను ఆదేశించాను. ఈ రోజు అర్థిస్తున్నాను. ఏ దీప్తి నాలో ఇన్నాళ్లూ జ్వలించిందో, ఈ నాడు ఆ వెలుగు ఆరిపోయింది ఆరిన దీపాన్ని మళ్ళీ వెలిగించలేం. అస్తమించిన నక్షత్రాన్ని నేను. ఇక జీవితంలో ఆశించేది ఏదీ లేదు. దేవిముందు తప్ప మరెవరి ముందూ తలవంచని నేను రాజుముందు మోకరిల్లవలసిన రోజు వచ్చింది. జైసింగ్ ! ఆనాడైనా రాజరక్త రంజితం కాకుండానే సూర్యాస్తమయం అవుతుందేమో. నీకు

నేను తండ్రిని తండ్రికంటె ఎక్కువవాణ్ణి జైసింగ్. నాయనా! ఈనాడు నీకు మోకరిల్లుతున్నాను.

జైసింగ్ : గురుదేవ్! అసలే తునకలు తునకలైన నా హృదయాన్ని మరింత భగ్నం చేయకండి. ఈ అర్ధరాత్రి లోపునే రాజరుధిరం తెచ్చి దేవి దాహం తీరుస్తాను. చివరికైనసరే సహా నా ఋణం చెల్లించుకుంటాను. (వెడతాడు)

(వెలుపల తుఫాను)

రఘు : ఓహో! ప్రచండ రూపిణి కాళీమాత కడకు విజృంభిస్తున్నది. ఆమె శాపాల మేఘ గర్జనలు నగర వీధులలో ప్రతిధ్వనిస్తున్నవి. భయదక్షుదా ఝుంఝూనిలాలు విశ్వవృక్ష శాఖోపశాఖలను ఉగ్రూతలూగిస్తున్నవి.గగన తారలు గజగజ వణికి రాలిపోతాయి. తల్లీ! జగజ్జననీ! నీ భక్తులను ఇంతకాలం ఈ సంశయ మహాంధకారంలో ఎందుకుంచావు తల్లీ? కత్తిదూసే కఠోర బాధ్యతను బలహీనులైన నీ భక్తులకు ఎందుకు అప్పగించావు దేవీ? నీ దృఢహస్తంతోనే కత్తిదూసి క్షుద్రలోకాన్ని కబళించు.

( అపర్ణ ప్రవేశం )

అపర్ణ : జైసింగ్! జైసింగ్! (పిలుస్తుంది)

రఘు : నీవా? వెళ్లు. అశుభమైన నీ ముఖాన్ని నాకు చూపకు.

అపర్ణ ! (వెడుతుంది.)

రఘు : జైసింగ్ తిరిగి వస్తాడా! రాకపోతే... వస్తాడు...

జైసింగ్ వస్తాడు. తన వాగ్దానం నిలబెట్టు కుంటాడు. కాళీమాతా ! విజయప్రదాయినీ ! జైసింగ్‌కు కార్య సిద్ధి అనుగ్రహించు తల్లీ. జైసింగ్ రాకపోతే... అతను త్రోవలోనే మరణిస్తే..... కాపలాదార్లు అతన్ని సంహరిస్తే .. జగజ్జననీ ! సర్వలోక సాక్షీ ! అపజయం కలుగకుండా కాపాడు తల్లీ. నీ భక్తులను నీవు కాపాడకపోతే ఈ లోకంలో ఈ నాస్తికులు నీకు నిలువ నీడ లేకుండా చేస్తారు తల్లీ. జననీ ! కపాల మాలాధారిణీ ! శక్తీ! మహాకాళీ

(జైసింగ్ పరుగెత్తుకు వస్తాడు.)

రఘు : జైసింగ్ ! ఏదీ రాజరక్తం ?

జైసింగ్: రాజరక్తం నా దగ్గరే ఉంది గురుదేవ్. నన్ను వదలండి. నేనే రాజరక్తాన్ని దేవికి సమర్పిస్తాను. (విగ్రహం వద్దకు వెళ్ళి) జననీ! లోకాన్ని యావత్తూ నీ చనుబాలతో పోషిస్తున్న నీకు రాజ రక్తంపై కాంక్ష కలిగిందా తల్లీ. నేను రాజును. క్షత్రియవంశ సంజాతుడను. నా వంశీకులు సింహాసనాలపై ఆసీనులై ధరామండలాన్ని పాలించారు. తల్లీ ! నా నర నరాలలో రాజవంశ రుధిరం ప్రవహిస్తూవుంది. తల్లీ ! ఈ రక్తాన్ని తీసుకో. త్రాగు. దాహం చల్లార్చుకో. (తనను తాను పొడుచుకుని చనిపోతాను.)

రఘు : జైసింగ్! ఎంత ఘోరం చేశావు. జైసింగ్! నీతండ్రినే చంపుకున్నావు. జైసింగ్! ఆగు. నీ బదులు నన్ను చంపు.

(అపర్ణ ప్రవేశిస్తుంది)

అపర్ణ : జైసింగ్! జైసింగ్!

రఘు : చిట్టితల్లీ! అపర్ణా! పిలుతల్లీ. జైసింగ్‌ను పిలుతల్లీ. కంఠమెత్తి పిలుతల్లీ.

(అపర్ణ కాళీవిగ్రహం ముందు మూర్ఛిల్లుతుంది)

రఘు : (తల నేలకు కొట్టుకుంటూ) జననీ! జైసింగ్‌ను బ్రతికించు తల్లీ! జననీ! నీవెందుకు బ్రతికిస్తావు? బ్రతికించవు. నీవు రాయివి గ్రుడ్డిదానివి. చెవిటిదానివి. ప్రపంచమంతా నీవాకిటముందు రోదిస్తున్నా నీకు వినిపించదు. కోటానుకోట్ల ఉదార మానవహృదయాలు నీ పాదాలవద్ద బద్దలైపోతున్నా నీ హృదయం కరగదు, నా జైసింగ్‌ను నాకివ్వు. ఇవ్వవు. ఇకనీతో నాకూ ఈ లోకానికి అనవసరం. ఈ శిలల బరువులు అనవసరం (కాళీమాత విగ్రహాన్ని క్రిందికి త్రోసివేస్తాడు)

(రాణి గుణపతి ప్రవేశం)

గుణ : మాతా! ఏదీ దేవి?

రఘు : దేవి లేదు.

గుణ : నా దేవిని నాకు చూపండి గురుదేవ్. పూజాపుష్పాలు తెచ్చాను. నా హృదయరుధిరంతోనే ఆమె దాహం చల్లార్చడానికి వచ్చాను.

రఘు : దేవి లేదు. ఎక్కడాలేదు. అంతాభ్రమ.

(అపర్ణ ప్రవేశం.)

అపర్ణ : నాన్నా!

రఘు : చిట్టితల్లీ! నన్నా పేరుతో పిలవకు, నేను అనర్హుణ్ణి

మహా పాపిని.

అపర్ణ : నాన్నా! రండి. ఈ గుడి విడిచిపెట్టి రండి. ఎక్కడి కైనా వెడదాం.

(గోవింద్ ప్రవేశం.)

గోవిం : ఏదీ దేవి?

రఘు : దేవి లేదు.

గోవిం : మరి ఈ రక్తధార ఏమిటి?

రఘు : నిన్ను ప్రేమించి ఆరాధించిన జైసింగ్ తన్ను తాను చంపుకున్నాడు.

గోవిం : ఆ!...కారణం ?

రఘు : మానవ ప్రాణాలను పీల్చి పిప్పిచేస్తున్న అసత్యాన్ని తుద ముట్టించడానికి తనను తాను చంపుకున్నాడు.

గోవిం: జైసింగ్ ! నీవు మరణించ లేదు. మృత్యువునే జయించావు.

గుణ : రాజా !

గోవిం : రాణీ !

గుణ : దేవి లేదు.

గోవిం: దేవి తల శిలా కారాగారాన్ని భేదించుకొని స్త్రీ మూర్తిగా మారింది.

అపర్ణ : రండి, నాన్నా! వెడదాం.

రఘు : రా తల్లీ! నీవే మాతవు. జైసింగ్ కడపటి బహుమతి రా తల్లీ ! వెడదాం.

— తెర —



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B118 |
| పుస్తకం పేరు | బలిదానము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | ch-Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |